1956 సం॥ అక్టోబరునెల 25-వ తేదిన తిరుపతిలో ఆంధ్ర కేంద్ర సహకారబోధనాలయమున జరిగిన సభలో "ఇందిరా వసంతము" అను నాటకమును అంకితముచేసిన సందర్భమున తీసిన ఛాయాపటము.



# ఇందిరా వసంతము

[Translation of Shakespeare's Play
The Merchant of Venice.]



గ్రంథకర్త:
గుఱ్ఱం వేంకటేశయ్య

 [1-4-1957.

# అంకితము



తే 25—10—56 దిన, తిరుపతిలో ఆంధ్రసెంట్రల్ కోఆపరేటివు ఇన్స్టిట్యూటులో శ్రీ కె.సుబ్రహ్మణ్యంనాయుడు, యం. ఏ., ఐ. ఏ. యస్., గారి అధ్యక్షతన జరిగిన సభలో శ్రీ జి. చంద్రశేఖరం, ఎం. ఏ., గారికి కృతి సమర్పణ గావింపబడినది.

# తొలి పలుకు

శ్రీయుతులు గుఱ్ఱము వేంకటేశయ్య, బి. ఏ., గారు రచించిన "ఇందిరా వసంతము" వారాంధ్ర కవితామతల్లి కర్పించిన ప్రథమ కుసుమాంజలి యనవచ్చును. ఈ కృతి షేక్స్పియరు మహాకవివ్రాసిన "Merchant of Venice" అను నాటకమున కనువాదము. కేవలమనువాదమనుటకంటె అనుకరణమనుట సమంజసమేమో! ఏలయన, మూలమునందు 17 రంగములలో విస్తరింపబడియున్న వస్తుసారమును గ్రహించి వేంకటేశయ్యగారు 13 రంగములలోనికిమిడ్చియున్నారు. ఆంధ్రసంప్రదాయమున కనువగు భాగమునకే ప్రాధాన్యమిచ్చుటుచితమని యెంచుటయును, పరిమితకాలములో నాటకమును సొంతముగా నాడుట కనుకూలముగజేయ సంకల్పించుటయు నిందులకు కారణములై యుండవచ్చును. అట్లయిన, వారు సంకల్పసిద్ధులైనారనుటకు సందియములేదు, 1956 జూను నెల 30–వ తేదీని తిరుపతిలో ఆంధ్ర సెంట్రలు కో ఆపరేటివు ఇన్స్టిట్యూటులో ప్రదర్శించినపు డీరూపకము రసికజనావళిప్రశంసల నందుకొన్నది.

"ఇందిరా వసంతము" ను జదివినపుడు గ్రంథకర్త కవితావ్యాసంగమునందు తరుణులు కారనియు ననేక రచనలయందారి తేరిన వృద్ధమూర్తులైనట్లును స్పష్టముగాక మానదు. ఇచట, వేంకటేశయ్యగారు గద్యపద్య రచనల రెండింటిని సందర్భోచితముగా సవ్యసాచివలె సాగించియున్నారు. షేక్స్పియరు సాహిత్యమునందు మొదటి పాదమునకుజెందిన "Merchant of Venice" లో రచనాసారళ్యమును, శైలియందలి మార్దవమాధుర్యములును, భావమునకు భాషకును గల సామరస్యమును అక్షరరమ్యతయు బెక్కులగుప్రాచీనగాథలస్మరణయు విశేషములని పండితులందురు, సరిగా నీ విశేషములే వేంకటేశయ్యగారి యాంధ్రీకరణమునందు జాలవఱకు ప్రతిఫలించియుండుట శ్లాఘనీయమైయున్నది. దీనికి అకారణమగు మనోవైకల్యముగూర్చి శివరావు చెప్పినమాటలు "ప్రకృతి చిత్రమేమోగాని, కొందఱెల్లప్పుడు నూరక పకపక నవ్వుచుందురు. మఱికొందరు మొగము చిట్లించుకొనుచు మచ్చునకైనను మందహాసమెఱుగరు;"—

ప్రియురాలగు ఇందిర గూర్చి వసంతుడు చేసిన వర్ణన :—

"సుందరి యననేల, సుందర శబ్దంపు
[illegible] సుందరాంగి"

ఇందిర స్వయంవరమునకై వచ్చిన రాజుల నాడిన అపహాస్యమును, "గత కాలము మేలు వచ్చుకాలము కంటెన్" అన్న సామెత యీ మత్స్యాధిపతికన్వ యింపకుండుఁగాక; మఱియు "ఈమేనిఛాయ వారంద రీతనివలెనే వరింతురు గాక;"—

సమస్తము నర్పింపుమను ఇందిర ఆడినపలుకులందలి కవితా ధార

"అరయన్ విద్యయెలేమ; ప్రజ్ఞయును శూన్యాకారమే;—"

న్యాయస్థానమున సత్యమూర్తియనిన విషాదగంభీరమగు వాక్యము "సేటు కత్తిపోటు కొంచెములోతుగఁ బ్రాకినచో, నేను నాహృదయపూర్వకముగ ఋణవిముక్తిఁ బడయుదును;"—

నాటకాంతమును సూచించు ఇందిర వాక్కునందలి తేటతెలుగు "తూరుపు తెలివొందు చున్నది;"—

అనునవి కొన్ని మచ్చుతునకలు.

పూర్వగాథాస్మరణమనుమూలమునందలి యొకానొక గుణవిశేషము వేంకటేశయ్యగారి యాంధ్రీకరణమున చక్కగా కాననగుచున్నది. ఇందులకు ఒకటవ యంకమున తృతీయరంగమున సేటునోట వెలువడిన ప్రమాణము:—

"ఘనగోపాలకుఁడేల పాల్ పెరుగుమీగళ్ళన్ హరించెళా భువిళా"

చతుర్థాంకమున ప్రథమరంగమున ఇందిర గావించిన కరుణస్తుతి;

సీ॥ "శివునిజటాజూటశిఖరిపై నుదయించి
భువిని సస్యంబులఁ బ్రోదిసేయు;—"

పంచమాంకమున ద్వితీయరంగమున చంద్రరేఖాసుందరేశులు వెన్నెలరేయి గూర్చి చేసిన ముచ్చటలు;

"ఏనిండువెలరేయి నింద్రుండహల్యతో
భోగించుకోర్కెమైయేగెనొక్కొ—"

ఆ రంగముననే జైత్రయాత్రముగించి ఇంటికి తిరిగి వచ్చినతోడనే ఇందిర పల్కిన సూక్తియు:—

గీ॥ "చక్రవర్తి ప్రతాపుండు చెఱనువీడు
వఱకు పేరయ్య రాజ్యమ్మువఱలలేదె!"— ఇత్యాదులు

సాటిగా నుదాహరణములు.

ఈ రూపకమునందచటనచట కవితాస్రవంతులు (Lyrical passages) పొంగి పొటలినవి. అట్టిచో వేంకటేశయ్యగారు పద్యరూపమున తద్భావమాగావించి సందర్భ శుద్ధిని గాపాడియున్నారు. వసంతుడు స్వయంవరమునకు వచ్చినపుడు,

" కోరికొనక నన్గోల్పోయినచో
రాజహంసగతి రాగాలాపన '' అనుచు యిందిర ప్రారంభించిన పాటయు :—

చంద్రరేఖాసుందరేశులు సల్లాపములాడుసమయమున, సుందరేశుడు

" చందురుడొప్పఁబూర్ణకళఁ జంద్రికవెల్లువ లుల్లసిల్లగా—" యనుచు వనశోభను వర్ణించుచు చెప్పిన ఉత్పలమాలయును,

" ఆ బృందావని గానలోలుడు విహారాహ్లాదిగాఁ గృష్ణుడున్—" అనుచు సంగీతప్రభావము నుగ్గడించుచు చెప్పిన శార్దూలమును ఈ యనువాదలక్షణము నుత్ప్రేక్షించుచున్నవి.

అనువాదపనిన సులభసాధ్యము కాదని యాకార్యమును బూనుకొనినవారికే తెలియగలదు. అందును షేక్స్పియరు రచనలదెనిగించుట గురుతరభారము. అయినను, వేంకటేశయ్యగారు తమకార్యమునందు సిద్ధహస్తులనుటలో నతిశయోక్తి లేదని యీ గ్రంథమును సహృదయముతో చదివిన వారందరు సమ్మతింతురు.

మొట్టమొదట సత్యమూర్తిని చూచుటతోడనే అయన యెడల తనకు గల దురభిప్రాయమును వెల్లడిసేయుచు సేటు " అతివినయం ధూర్తలక్షణమ్ " అను పూర్వోక్తిని స్మరించుటలోను, " ఓర్పు మాజాతి చిహ్నము '' అనుచు సత్యమూర్తి వలన తాననుభవించు కష్టమును సూక్ష్మముగా దెలిపినపుడును, మత్స్యాధిపతి బంగారుబరణిలోనున్న చీటీని చదివి " మిసిమిదీపించునదియెల్ల పసిడిగాదు " అని తనతప్పిదము తెలిసికొన్నపుడును, " నష్టసముద్రమునమునిఁగి, దుఃఖసాగర మునఁదేలుచున్న నా కష్టకాయమునుండి రేపొకసేరుమాంసముకూడ దొరకదేమో!" అనుచు సత్యమూర్తి నిరాశను వెల్లడించినపుడును, సేటుమనసునుమార్చుట అసాధ్యమనితెలుపుటకు సత్యమూర్తి " పరగరాతిగుండుపగులగొట్టగవచ్చు '' అను వేమనవాక్యమును స్మరించుటయు, నామిత్రుల యనువాదమందలి యౌచిత్య మునుదాహరణరూపముగా బ్రకటించుచున్నవి.

రచయితశైలి మృదుమధురమనియు, ద్రాక్షాపాకమనియు సహృదయులు దానినిగూర్చి వ్రాయుట పరిపాటియే. అట్లయ్యును, వేంకటేశయ్యగారిశైలిమృదుమధురమని నేను ప్రత్యేకముగా వ్రాయుట సమంజసమే అని రసజ్ఞులు గ్రహింపక మానరు. వీరిధోరణి గ్రాంథికమయ్యును, సరళము; ఉదాత్తమయ్యును తేటతెల్లము. "అంత్యశిశిరర్తు మధువసంతాగమంబు దోపజేసెడువిధమొ యీ దూతరాక, " అని ఇందిరయు.

"భార్యాభర్తల బ్రహ్మవిధించుచు
ఫాలతలమ్మున( బసతో వ్రాయును " అని నీలవేణియు,

"అట్టి వెన్నెల పలపుమై యడుగులిడెను
చంద్రరేఖయు గోల్కొండ జాడపట్టి" అని సుందరేశుడును పల్కిన పంక్తులే నాయీమాట కాధారములనినజాలును.

షేక్స్పియరుకావ్యమునకు బ్రతికృతి కావించుట సామాన్యుల కలవికాదు. అయినను, చేతనైనంతవఱ కట్టికృషిసల్పిన వారందరు మనకుబ్రశంసనీయులు. అనువాదములందేపైన లోటుపాటులుండుట యెంతటి రచయితలకైనను తప్పనిసరి. దోషములెంచుట నా యుద్యోగము కాదు, వేంకటేశయ్యగారి యాంధ్రీకరణము తెలుగుదేశమందలి రసజ్ఞులందరి యామోదమును బడయగలదు. ఈ కవి మరి కొన్ని నాటకములనిట్లే తెనిగించవలయునని మనసార నేను కోరుచున్నాను. షేక్స్పియరుకవితాప్రియులును తెలుగుసాహిత్యవిస్తరణాభిలాషులును నాకోర్కెను బల పఱచెదరుగాక !.

ఈ తొలిపలుకు వ్రాయుటకు నా కవకాశమిచ్చిన కవివర్యులకు నా నమస్కారము.

తిరుపతి,
17—1—1957

ఇట్లు
ఎమ్. ఎస్. ప్రకాశరావు.

# విన్నపము

నా జన్మస్థలము నెల్లూరుమండలమునఁగృష్ణాపట్టణము. బాల్యమున నొకనాఁడు మా తాత వెంకటేశయ్యగారు వ్రాసిన పుష్పబాణవిలాస మను నాటకము వ్రాతప్రతిని మాయింటఁ జూచియుంటిని. నేనును వారివలె నాటకకర్తనై యా నాటకప్రదర్శన భాగ్యము నందుదునో యను తలంపు నా కప్పట్టునఁ గలుగలేదు. తరువాత నెల్లూరునఁ దెలుఁగుపండితుఁడు నేతికృష్ణయ్యగారిదయతో నల్లసాని పెద్దనమనుచరిత్రపరిచయము నాకులభించెను. పిమ్మట వాగ్ధాటిస్పర్ధలో మొదటిబహుమతిగలభించిన యుత్తర రామాయణమును నేను జదివితిని. నా పినతండ్రి సహాయమున నేను వేసంగిసెల వులలో శ్రీనాథ విరచిత శృంగారనైషధమును, శ్రీ కృష్ణదేవరాయ విరచిత యాముక్తమాల్యదను, గవిత్రయప్రణీత మహాభారతమును, బమ్మెరపోతనభాగవత మును, గద్యకావ్యము నీతిచంద్రికను బఠింపనప్పటి కున్నతపాఠశాల విద్యాభ్యాసము నాకు ముగిసెను. కళాశాలపండితుఁడు శ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారి శిష్యుఁడనై ఛందోవ్యాకరణాలంకారశాస్త్ర పరిజ్ఞానమును నేను గొంతవఱ కలవఱుచుకొనఁ గలి గితిని. అభిజ్ఞాన శాకుంతలనాటక పునర్ముద్రణకు వలయు ధనమొసంగి నా పినతండ్రి వేంకయ్యగారు కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రిగారిని సత్కరించిన పిదప నాకు శాస్త్రిగారి నాటకములఁ బెక్కింటిని జదువుట ప్రాప్తించెను. ఆ కాలమున నెల్లూరునఁ బాఠశాల కళాశాలల విద్యార్థులేగాక, పౌరులును నాటకసమాజముల నెల కొల్పి, పెక్కునాటక ప్రదర్శనము లొనఁగుట పరిపాటిగానుండెను. విద్యార్థిదశలో నాంగ్లమహాకవులయుద్గ్రంథముల నెక్కువగఁ బఠించు నలవాటున నాకాంగ్లాంధ్ర భాషావాఙ్మయపరిచయము దినదినాభివృద్ధి నొందుచుండెను.

పట్టభద్రుఁడనై, వివాహితుఁడనై, యత్తవారియూరు పాటూరుగ్రామమునఁ దిక్కనకవి ఘంటపుబొరను బరికించినపుడు నాకును గవిత్వధార లభించి, యటు పిమ్మటనేనప్పుడప్పుడు వ్రాసిన కొన్ని పద్యములను 'సింహపురి' పత్రికలో 'బాలకవి' పేరఁబ్రచురించుచుంటిని. మా అన్నగారు సుబ్బరామయ్యగారు (కళా శాలాంగ్లోపన్యాసకులు) కాళిదాసుమేఘసందేశమును దెనిఁగింప, దాని ముద్రణ మును నేను జెన్నపురిలోఁ బూర్తిచేసినపిదప నేనునుఁ గవితావేశమున నాంగ్లనాట కాంధ్రానువాదమునకుఁ బూనితిని. ఆకాలమున నేనొక చిన్నయిన్స్పెక్టరు హోదాలో చెన్నరాష్ట్ర సహకారసంఘముల రిజిస్ట్రారు కచ్చేరిలోఁ బనిచేయుచున్న యేకైకాంధ్రుఁడను గాన వ్యవధికాలము వ్యర్థపుచ్చక సరస్వతీదేవికి వరివస్య సేయ

సమకట్టితిని. హిందూదేశమున సహకార పరపతిసంఘ సంస్థాపనావశ్యతకు మూల కారణము మార్వాడీసేటుల విపరీతవృద్ధివ్యాపారము గానఁ దత్సంబంధికార్య క్రమాచరణగాధ నుల్లేఖించు షేక్స్పియరు రచించిన యాంగ్లనాటకము (Merchant of Venice) 'వెన్నిసునగరవర్తకుఁడు' నా మనసు నాకర్షించియుండనోపు. అంతియఁగాక మితిమీఱి ఋణముచేసి ధనికురాలిని వివాహమాడిన వసంతుఁడు తనకు ఋణమిచ్చిన ప్రియమిత్రునిఁ బ్రాణాపాయమునుండి తప్పింపఁ దనప్రేయసి ధనాఢ్యత నిరుపయోగమగుటయుఁ, దనయర్ధాంగి పితృభక్తి, దైవచింత సూక్ష్మ బుద్ధి ప్రణయాంతశ్శుద్ధచిత్తము, త్యాగశీలము సహజ సౌజన్య సౌకుమార్య చమత్కార సుగుణసంపత్తిచే నాటకము మంగళాంత మగుటయు, నాంగ్లమూలమును బఠించినపుడే నా మనమున గాఢముగ నాటుకొనియుండెను. నేనును స్వానుభవమున ఋణవిముక్తిఁబొంది పరస్పరప్రేమానురాగపూరితకన్యను వివాహమాడి, ప్రణయాంగుళీయకమును నేధారవోసికొనియు ముగ్ధురాలగు నాసహధర్మచారిణితో గార్హస్థ్యము నెఱపుచు, సప్తసంతానముల నగ్రగణ్యమగు కావ్యకన్యకను బ్రథమ సంతానముగఁ బడయు నదృష్టమున నేనిందిరావసంతనాటకమును రచించుట సంభవించెను.

ప్రాగ్దేశపు పూర్వగాధలను జక్కదిద్ది షేక్స్పియరు మహాకవి యాంగ్లనాటకముల రచించి తన్నాటక ప్రదర్శనముల విజయవంతముగనొనర్చి శాశ్వతకీర్తి నొందెను. ఈ యాంగ్లనాటక కథాంశములను బాత్రలగుణశీలములను, చవిచూచి, దేశభాషలందు లెస్సయనిపించుకొన్న తేటతెనుఁగు భాషలో వెన్నిసునగరమువలెనే కీర్తిగడించిన కృష్ణరాయలనాటి విజయనగర రంగస్థలి సన్నివేశమున నాంధ్రసారస్వతమునకుఁ గాన్కగా నే నీ నాటకమును రచింప దొరకొంటిని. శకుని మోసముచే జూదమునవోడి పడరానిపాట్లుపడి చివరకుఁ గృతార్థుఁడైన ధర్మరాజు సామ్యమును దోపించు, త్యాగశీలుఁడు ధర్మనిరతుఁడు ప్రాణస్నేహితుఁడునగు సత్యమూర్తి కథాభాగము; శివధనుర్భంగమున శ్రీరాముఁడు జానకింబెండ్లాడఁగల్గిన విధమును జ్ఞప్తికిఁదెచ్చుచు మిసిమిదీపించుపసిడిని త్యజించి ప్రణయార్థియై సీసంపు డబ్బిని గోరికొన్నవసంతుఁ డిందిరాదేవిని వరించినగాథ; ఆంధ్ర ప్రబంధనాయకీనాయకులప్రణయానుభోగవర్ణనలకు దీటుగఁ జంద్రరేఖాసుందరేశులు కామాంధత నెఱపిన చైత్రయాత్రఫలము; కాఁటికాపరివేషమున హరిశ్చంద్రుఁడు భార్యచంద్రమతి తాళిబొట్టును గైకొన్న విషాదవిధమునఁ బురుషవేషమున నిందిరభర్తవసంతుని ప్రణయాంగుళీయకమును గైకొని చమత్కారవిషాదభావములఁ బెనవేసి హాస్యాంత

మొనర్చిన యితివృత్తము; చంద్రరేఖాసుందరేశు లుద్యానవనమున వెన్నెలవిహారము సలుపుచు మధురసంగీత కవితాధోరణి నానంద పారవశ్యమునఁజేసిన సరస సల్లాపములు; నాంగ్లనాటక ముఖ్యపాత్రల నామధేయములు, వ్యుత్పత్త్యర్థానుసారముగను, దదితరైతిహ్యములు భారతీయసాంప్రదాయానుగుణముగను బురాణేతిహాసకవిసమయసమ్మిశ్రితముయినుగల నాయీనాటక మాంధ్రావనికి మోదము చేకూర్పఁగల ప్రదర్శన భాగ్యమునకై చాలకాలము వేఁచియుంటిని.

1945-వ సంవత్సరమున నేననంతపురమున రాయలసీమసహకారబోధనాలయాధిపతిగానున్నపుడు విద్యార్థిబృందముచేఁ 'దెలుఁగుతల్లి' నాటకమును, పిమ్మట 1947-వ సంవత్సరమున గుత్తిపురప్రముఖులతోఁ గలసి ధర్మవర్ధనీ సమాజ యాజమాన్యమునఁ 'కృష్ణదేవరాయల' నాటకమును జయప్రదముగఁ బ్రదర్శించి నంతనే నా రచియించిన యిందిరావసంతనాటకశీఘ్రప్రదర్శనము నభిలషించి, నా యిలవేల్పుదీవెనను బడయఁగోరి నాందిపద్యమునారంభించి, మాతండ్రి వేంకటసుబ్బయ్యగారవసానకాలమున నాకు నేర్పిన చంద్రశేఖరస్తవముతో నాందిని బూర్తిచేసితిని. 1956-వ సంవత్సరము జూను తే 30 దినఁదిరుపతి పురమునఁ గేంద్రసహకార బోధనాలయమున నేను బ్రధానాచార్యుఁడనుగానుండ, నత్యంత కళాప్రియులు లలితకళాసమితివారి ప్రోత్సాహమున, నావద్ద శిక్షణ పూర్తిచేసికొన్న చిన్నయిన్స్పెక్టరులు తమ సంఘవార్షికోత్సవ సమయమునఁ బ్రాచ్యకళాశాల భవనమున, భారతలోక్సభాధ్యక్షుఁడు శ్రీ మాడభూషి అనంతశయనమయ్యంగారి యాజమాన్యమున రసవంతముగఁ బ్రదర్శింపఁగల్గుట నాకమందానంద మొనర్చెను. అట్టితఱి శ్రీ వేంకటేశ్వరవిశ్వవిద్యాలయోపన్యాసకులు శ్రీ యం. యస్. ప్రకాశరావుగారు మిత్రత్వమున, నన్నీనాటకప్రచురణకుఁ బ్రేరేపించి, తొలిపలుకువ్రాసి, మీదుమిక్కిలి నా యుత్సాహమును ద్విగుణీకృతపఱచిరి. పిమ్మట తే 25—10—56 దిన, నాటకకళాభిమానపోషకులు శ్రీ జి. చంద్రశేఖరంగారుఆంధ్ర సహకారసంయుక్తరిజిస్ట్రారుగాఁ దిరుపతికి విచ్చేసినపుడు తలవనితలంపుగా నేను వారికి నా యీ కావ్యకన్యక నంకితముచేయ సాహసింపఁగా వారును గృతిపతిగా నుండుటకు దయతో నంగీకరించిరి. ఆ సభ సహకారశాఖాధిపతి శ్రీ కందికట్టు సుబ్రహ్మణ్యము నాయుడుగారధ్యక్షస్థానము నలంకరింపఁ దిరుపతి కేంద్రసహకారబోధనాలయ భవనమున ప్రముఖసహకార శాఖాధికారులేగాక రెండువందలమంది యిన్స్పెక్టరుల సమక్షమునఁ జరుగుట ముదావహము. కడకు నేనీ నాటకమును దిరుపతి వేంకటేశ్వర ముద్రణాలయమునఁ బ్రచురింపఁగల్గుట శ్రీవారిదీవెనమే సుమా! దీని

ముద్రణమున నాకుఁ బరిచితులై, యమ్ముద్రతులను సరిదిద్దిన శ్రీ వేంకటేశ్వరప్రాచ్య భాషాపరిశోధనాలయమున సంస్కృతభాషలో రీడరు శ్రీ కొంపెల్ల దక్షిణామూర్తి శాస్త్రిగారు నాకు వందనీయులు. ఇందుమూలమున, నే నీ గ్రంథరచనాదివిధుల నిర్వహణములో నాకుసాయమొనర్చిన వారందఱికిని గృతజ్ఞత తెలుపుచున్నాఁడను. అంతయు భగవదనుగ్రహమనుటకు సందియములేదు.

"నాటకాంతం కవిత్వమ్"

"రసాత్మకం కావ్యమ్"

"రసోవై సః రసగ్గుహ్యేవాయం లబ్ధ్వానందీ భవతి"

ఈః పై వాక్యములను సార్థకపఱచుటకు నా యిందిరావసంతము పూనుకొన్నచో, నేను కృతార్థుఁడను. నానాటకములోని మెఱుఁగులన్నియు నాంగ్లమహాకవికిఁ జెందవలెను. లోపములు నావని నే నెఱుంగుదును. పాఠక ప్రేక్షక మహాశయులు నన్ను మన్నింతురుగాక!

ఇట్లు,
కళారాధకుఁడు
గుఱ్ఱం. వేంకటేశయ్య.

తిరుపతి,
2—3—1957.

# AN APPRECIATION.

1956 జూన్ తే 30 దిన తిరుపతిలో సెంట్రల్ కోఆపరేటివు ఇన్స్టిట్యూటు వార్షికోత్సవ సమయమున నేనుపన్యసించుటయు, అప్పుడు ప్రిన్సిపాలు గుఱ్ఱము వేంకటేశయ్యగారు రచించియుండిన " ఇందిరావసంతము " అను నాటకమును ఆ ఇన్స్టిట్యూటులో తరిఫీదుపొందిన ఇన్స్పెక్టరులు ప్రదర్శించుటయు జరిగెను. ఆ ప్రదర్శనము నాకును విచ్చేసిన యితర పౌరులకును చాల సంతోషదాయకముగ నుండెను. కవిగారు ఆ నాటకమును ముద్రించి పాఠకుల కందజేయుట సమంజసము. షేక్స్పియరుమహాకవి ఆంగ్లమున వ్రాసిన " Merchant of Venice " అను నాటకమునకు అనుకరణముగ గుఱ్ఱము వేంకటేశయ్యగారు రచించిన " ఇందిరా వసంతము " రసికజను లందఱికి ఆహ్లాదకరముగ నున్నది.

TIRUPATI,
16—3—1957.

*M. Ananthasayanam Ayyangar.*

## ఇష్టదేవతా ప్రార్థన

గీ॥ 1. నాదుదేవుఁడు స్వాతంత్ర్యనామధేయుఁ
డతఁడు తేఁడైనఁ బ్రాక్పశ్చిమార్థగోళ
పథముల న్విడఁదీసి స్వపక్షములనె
మిమ్ము రక్షించు నేవేళ సమ్ముఖమున ।

[Translation of Emerson's poem "My Angel, thy name is Freedom."]

2. కలఁతఁజెందకు సఖులెల్ల తొలఁగిరేని ;
ఆపకుముయాత్ర వాడిన నాసలతలు ;
ఒందకుముభ్రాంతి వెలుఁగనిజ్యోతికతన;
శ్రవణపుటముల నీకంఠరవమువినఁగ
నడవి పశుపక్షులెల్ల విన్నలముకొనును ;
నీదుస్వజనులె కఠినాత్ములౌదురేమొ,
ఐనఁ, జలియింపకుము నీవుమానసమున ।
తలుపుమూసిన, నీచేరుతావువీడి
వెనుకమరలకు ; పలుమాఱు విసుఁగులేక,
తలుపుతట్టియు ఫలమేమి గలుగకున్నఁ
బురుషయత్నము మానకు పురుషసింహ ।

[Translation of one of Gandhiji's Prayer Songs].

3. దివ్యజ్యోతిరో, మార్గమ్ము దెలుపు దయతో ।
చిమ్మచీకటిగ్రమ్మె నిశీథవేళ ;
త్రోవజూపుము, నాయిల్లుదూరమైనఁ
దప్పటడుగులువేయక, దారిసాగ.
ఎన్నఁడెఱుఁగను, యీ స్థితిఁదెన్నువేడి,
కన్నవాఁడను నాత్రోవఁ జన్నవాఁడ ;
సంతసాంబుధి, స్వోత్కర్ష, సమసె భయము,
గర్వమొదవెను ; లేదిప్డు పూర్వస్మృతియె;
అపుడు నన్గాచె నీశక్తి, యిపుడు దివ్య
జ్యోతివై, రేయికడ, మార్గచోదికాఁగఁ,
గొండవాగుల చిత్తడికోనదాటి,
విస్మరిత చిరవాంఛిత విహఁగ వీథిఁ,
జిరుతనవ్వుల ప్రత్యూషశ్రీలఁగాంతు ।

[Translated from Newman's poem "Lead, kindly Light."]

## ఆదికావ్యస్తుతి

గీ॥ పఠన ద్విజులకు వాగృషభత్వమొసఁగు ;
రాజపుత్త్రుఁడు సకలసామ్రాజ్యమొందు ;
వైశ్యుఁడైనచొ వ్యాపారవృద్ధిగాంచు ;
శూద్రజనుఁడు మహత్త్వప్రాశస్త్యమొందు :

చం॥ అహరహమాదరమ్మున మహర్షిముఖాంబుజపుష్పస్రావముఁ
దహతహలాడుకర్ణములదోసిలిదొప్పలఁ ద్రావిత్రేపుమఁ
అహాహాజనుండు రామచరితామృతసారముఁగ్రోలిశాశ్వతిఁ
విహరణసేయు స్వర్గసుఖవిస్తృతి జన్మవిరాహితంబుగాఁ.

(శ్రీ మద్రామాయణము.)

# నాంది

చం॥ తిరుపతివేంకటేశ్వరులదీవెనసత్కవివాగ్విలాససం
భరితరసానుభూతికలభాషిణికన్నియ, యిందిరావసం
తరసముధర్మవర్ధలికిఁద్రాపెడు గుట్టమువేంకటేశునిన్
బురమునఁ బౌరులన్ దయతోఁ బ్రోవుము భక్తులఁ జంద్రశేఖరా!

# ప్రస్తావన



**నటి, సూత్రధారులు ప్రవేశము.**

నటి : ఏమి యీ కోలాహలము ?

సూత్ర : ఎందులకో తెలియలేదా ? ఆంగ్లనాటకరాజము నాంధ్రరంగస్థలమునఁ జూచు భాగ్యము లభించినందులకే గదా !

నటి : అనువాదకు లెవరో ?

సూత్ర : ఆహా ! సింహపురమునఁ గవికులమని పేరెన్నికగన్న గుఱ్ఱమువారివంశమునజన్మించి ఆంధ్రాంగ్లభాషాకోవిదులై, రాయలసీమసహకారబోధనాలయ, పుస్తకభాండాగారములసహాయార్థ మనంతపురము, గుత్తి, హిందూపురముల నాటకప్రదర్శనములనెలకొల్పుతటి నటకాగ్రేసరుఁడగు కీర్తిశేషులైన శ్రీ రొద్దమురాజారావుగారిమన్ననలంబడసిన శ్రీ వేంకటేశసుకవియే సుమా !

నటి : వారికి శ్రీ రాయలవారిపై నెక్కువగౌరవము కలదా ?

సూత్ర : కావుననేగదా నేడు రంగస్థలిపై రాయలవారిని జూచుభాగ్యము మన కొదవుచున్నది !

నటి : ఐన నిఁక మన మాలసింపరాదు.

సూత్ర : అంతయు సిద్ధమే.

(నిష్క్రమింతురు).

# ఇందిరా వసంతము

## ప్రధానపాత్రలు.

1. రాయలు : విజయనగరమహారాజు శ్రీ కృష్ణదేవరాయలు.
2. మత్స్యదేశాధిపతి }
3. కేరళప్రభువు } ఇందిరాదేవిస్వయంవరమున కేతెంచినరాజులు.
4. సత్యమూర్తి : విజయనగరమందొకప్రముఖవర్తకుఁడు.
5. వసంతుఁడు : సత్యమూర్తిస్నేహితుఁడుఇందిరావరుఁడు.
6. భరతుఁడు }
7. శివరావు } సత్యమూర్తివసంతులచెలికాండ్రు.
8. కేశవరావు }
9. సుందరేశం : చంద్రరేఖాప్రియుఁడు.
10. మార్వాడీసేటు : విజయనగరమున నొకధనికుఁడు.
11. గోకులదాసు : మార్వాడీసేటువిహితుఁడు.
12. బసవయ్య : సేటుసేవకుఁడు (హాస్యగాఁడు).
13. పెద్దబసవయ్య : బసవయ్యతండ్రి (గూనితాత).
14. గోపాలుఁడు : వసంతునిసేవకుఁడు.
15. రాముఁడు }
16. సుబ్బడు } ఇందిరాదేవిసేవకులు,
17. ఇందిర : రాచకన్య.
18. నీలవేణి : ఇందిరచెలికత్తె.
19. చంద్రరేఖ : సేటుకామార్తె.
20. విజయనగరపౌరులు, న్యాయమూర్తులు, చెఱరక్షకులు,

స్థలము :— విజయనగరము — గోలకొండ.

# ఇందిరా వసంతము



| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 8 | బాధకరంబయి | బాధ ఘనంబయి |
| 4 | 7 | ఋణద్వితీయమి | గనప్పురెంటని |
| 11 | 4 | సత్యమూర్తి | సత్యమూర్తి |
| 24 | 6 | శ్రమయెల్ల | శ్రమమెల్ల |
| 25 | 22 | హీనుడగానేను | లేమినినేనిట్లు |
| 30 | 17 | కామజనైజము | కామజనైకము |
| 33 | 20 | యాక్షేపణమే | యాక్షేపణమే |
| 41 | 10 | వెచి | వేచి |
| 45 | 29 | ఊా విజయ | నీ విజయ |
| 50 | 2 | ఎూకము | మాంకము |
| 52 | 14 | దుష్రిప్ప్రిపంచ | దుష్ప్రిపంచ |
| 52 | 28 | నిద్రింంమ | నిద్రింమ |
| 53 | 3 | న్నను | నన్ను |
| 57 | 17 | ఇతంత | ఇదంత |
| 58 | 5 | పసం | సత్య |
| 58 | 8 | నంతయుఁ | నంతను |
| 58 | 15 | రండుప్రశ్నో | రండు. ప్రశ్నో |
| అట్టమీద (వెనుక) | 7. | భాగ | భాష. |

# ఇందిరా వసంతము

## ప్రథమాంకము

మొదటిరంగము :— విజయనగరమున నొక వీథి.

ప్రవేశము : సత్యమూర్తి, శివరావు, భరతుఁడు.

సత్య : మిత్రులారా !

ఉ॥ కారణమేమొ, వాస్తవముకానగరాదు మదీయ చింతకున్:
ఆరటమెచ్చెనాకు ; శ్రమమయ్యెడి మీకును ; మన్మనోవ్యథా
భారపుమూల కారణము బాధకరంబయి సద్వివేక సం
స్కారవిహీనుఁజేయుటను స్వాత్మనెగుర్తిడ నేరనయ్యెదన్ ॥

శివ : ఆర్యా, మీ మనసు సాగరకల్లోల సంచలితమై కలవరము నొందుచున్నది. కాని మీయోడలు గంభీరసంరంభముతో మహోత్సవమువలె నరుదెంచుచు, చెంతనేగు చిన్ననావలజోహారు లందుకొనుచుండును.

భర : అయ్యా! నేనట్టి పరిస్థితిలోనున్నచో, గాలివీచుదిక్కును రేవుపట్టణముల వైపును జూచుచు నాయాశల సంస్మరించుచుండుననుట నిశ్చయము. దుశ్శకున మావంత కన్పడినను, జింతావ్యాకులత కలుగకమానదు.

శివ : అవును అట్టిసమయమున,

సీ॥ అరటితోటలోన నాకుఁజీల్చెడు పిల్లగాడ్పులకే నావకలఁగునేమొ ?
దేవాలయోన్నతదృఢగోపురముఁబోలుశిలలున్నవేమొకో సేతువందు ?
అని భీతిపొడమును. కావునఁదన సరకుటోడల తలంపువలనఁగాదేని
సత్యమూర్తికిఁ జింతమటెందులకు ?

సత్య : కాదు నా మాట నమ్ముఁడు. నా భాగ్యమంతయు నొక్కయోడలో నొక్కచోటలేదు. నాకలిమి, యీ సాలుసరి ఆదాయముమాత్రమే కాదు. కావున నా యోడలఁదలఁచి నేను చింతించుటలేదు.

శివ : లేదేని, మీరెవ్వతెనో మోహించియుండవలెను.

సత్య : ఛీ ! ఛీ !

శివ : కాకున్నచో, మీచింతనిర్హేతుకమనవలె. ప్రకృతి చిత్రమేమోగాని, కొందఱిప్పుడు నూరక పకపక నవ్వుచుందురు. మఱికొందఱు మొగముచిట్లించుకొనుచు మచ్చునకైనను మందహాసమెఱుఁగరు.

ప్రవేశము: వసంతుఁడు. సుందరేశం. కేశవరావు.

భర : ఓహో ! మా ప్రాణస్నేహితులు వసంతయ్య. సుందరేశం. కేశవరావులు వచ్చుచున్నారు. ఇఁక మేమువెళ్ళెదము.

శివ : మీరు సంతోష భరితులగువఱకు నేనాగుదునుగాని. యీ వచ్చినవారు నాకన్న నెక్కువ సమర్థులు.

సత్య : మీరు మీపనులగురించి వెళ్ళిపోవుటకిది మంచిసాకు.

శివ : ఆర్యులారా ! నమస్కారము.

వసం : మిత్రమా ! నీ విపుడే వెళ్ళవలెనా ?

శివ : అవును, పిదప సావకాశముగఁ గలసికొందము.

[శివరావు, భరతుఁడు నిష్క్రమింతురు.]

సుంద : వసంతయ్యా, నీవు సత్యమూర్తిని గలసితివి. ఇఁక మాకిరువురికి సెలవొసంగుము. భోజనవేళకు మనమెచ్చటఁగూడవలెనో జ్ఞప్తి యుంచుకొనుము.

వసం : నాకు జ్ఞాపకమున్నదిలే.

కేశవ : సత్యమూర్తీ! ఏమి నీ దైన్యము ? ప్రాపంచిక విషయములందింత విచారమెందులకయ్యా ? అత్యాసక్తి నష్టదాయకము గదా ! నీముఖవైఖరిచాలమారినట్లు తోచుచున్నది.

సత్య : కేశవా! నాకుఁ బ్రపంచము తావన్మాత్రమే. ఈ జగన్నాటకరంగమునఁ బ్రతిమానవుఁడు నొక పాత్ర ధరింపవలెను. అందు నాయది చింతావహము.

కేశవ : నేను విదూషకపాత్ర నటింతును. వార్ధక్యమునఁగూడ నేను నవ్వుచుఁ బ్రేలుచుందును. ముసుఁగువెట్టుకొని మూలఁగూర్చుండుట నాకు సరిపడదు. సత్యమూర్తీ! కొందఱు తాము చాల వివేకులమని యితరుల భ్రమింపఁజేయఁదలఁచి, మౌనముద్ర వహించి, కదలక, మెదలక పలుకక, నిశ్చేష్టితులై యుందురు. అట్టివారి యవివేకము వారు పెదవి మెదపినంతనే బయల్పడును. ఇది వాస్తవము. మీరు మాత్రము మీదైన్యమునింక వదలుఁడు. సుందరేశా! రా! మనము పోదము. నేను భోజనానంతరము మరలవచ్చెదను.

సుంద : నేనా మౌనవివేకులలో నొకఁడనై యుండవలెను. ఏలయన కేశవ రావు నన్నెపుడును మాటలాడనీయఁడు.

కేశ : ఇంక రెండుసంవత్సరములు నీవు నావద్దనున్నచో నీ కంఠస్వరము నీకుఁ దెలియకుండఁ జేసెదను.

సత్య : మంచిది వెళ్ళిరండు.

కేశ : మనఃపూర్వకవందనములు.

[కేశవరావు, సుందరేశం నిష్క్రమింతురు]

సత్య : వీని మాటకేమైన నర్థమున్నదా ?

వసం : ఈ విజయనగరమునఁగల జనులెల్లరఁ గెలిచిన ప్రేలుడుకాయ కేశవ రావు. వ్యర్థాలాపము లందతనికి విసుఁగులేదు. చివరకు "పడ్లగింజలో బియ్యపుగింజ" సామెత.

సత్య : వసంతా! ఏతరుణీమణికొఱకు నీవు రహస్యయాత్రసలుప నిశ్చయించితివో, ఆమెపేరు నాకు నేడు తెలిపెదనంటివి గదా!

వసం : సత్యమూర్తీ! నేను నాస్థితికిమించిన వ్యయముచేసి నాయాస్తిని పాడు చేసినది నీకుఁ దెలిసినదే కదా! నాకు సౌఖ్యప్రాప్తిలేదని నేను మొఱ పెట్టుటకాదు. నేనిదివఱలోఁ జేసిన ఋణములఁ దీర్చువిధమరయుటయే నాముఖ్యోద్దేశము. సత్యమూర్తీ! ధనమును, వాత్సల్యమును, నాకొసంగి నీవునాకుగొప్పఋణదాతవైతివి. నేనుఋణబాధనుండివిముక్తిఁ బొరయు నుపాయమును నీకుఁజెప్పక మఱెవ్వరి కెఱింగింతును ?

సత్య : వసంతా! నీ వ్యవహారమంతయు నాకుఁదప్పక తెల్పుము. అందు గౌరవహానిలేకున్నచో నేను నాసర్వస్వము నీకు హస్తగతమొనర్తును.

వసం : ప్రియమిత్రమా!

శా॥ బాణంబొండసమానవేగమున దృగ్బాహ్యంబుగాఁ దత్ప్రతిన్
బాణం బున్వడినేసి బాలకుఁడు తద్బాణద్వయిం గన్నవి
న్నాణం బొప్పుబుణద్వితీయమిపుడున్నాకీ వొసంగన్‌దగున్
ప్రాణంబుండఁగరెంటిఁదీర్చెదను నాప్రావీణ్యమేపారఁగాన్ ॥

సత్య : నీవు నన్ను బాగుగ నెఱింగియు నింతదూరమడుగవలయునా? కాలయాపన మనవసరము. నాధనమునంతయు నీవువ్యయపఱచవచ్చును. ఇప్పుడెంత కావలెనో తెలుపుము.

వసం : ఆర్యా,

సీ॥ గోలకొండపురిని, గుసుమబాణాకృతి
నైశ్వర్యయుతకన్యయలరు నొకతె!
సుందరియననేల? సుందరశబ్దంపు
సొంపుపెంపొందించు సుందరాంగి!
ఆశ్చర్యమును గొల్పునతివ సౌశీల్యంబు;
చూడ్కులు ప్రణయంపు సూనృతోక్తు!
లిందిరయని చెల్వ సుందరనామంబు
అలవిష్ణురాణియేయనఁగ నొప్పు;
గీ॥ నట్టిమహనీయ గుణఖని నమరవరులు
మెచ్చి జగమెల్ల చాటింపఁ జొచ్చినంత
నరుగుచున్నారు తత్స్వయంవరము కొఱకు
సకలరాజాధిరాజులు సరభసమున ॥

సత్యమూర్తీ! వారితోఁ బోటీచేయుటకువలయు ధనము నాకున్నచో నేను తప్పక విజయముచేపట్టి మహాదృష్టవంతుఁడ నగుదునని నాబుద్ధికిఁబొడముచున్నది.

త్య : వసంతా ! ప్రస్తుతము నాద్రవ్యమంతయు సముద్రముపైనున్న దని నీకుఁదెలియును. ధనముగాని, ధనమొసఁగఁగల సరకుగాని నా కిప్పుడు చేతలేదు. కావున నీవు వెళ్ళి నాకీవురమున నిపుడెంత ఋణము లభించఁగలదో తెలిసికొనిరమ్ము. దానినంతయు నీకిప్పించి, ఆయింది రాదేవియున్న గోలకొండకు నిన్నంపెదను. ఇప్పుడే నీవు విచారించి యెవరివద్ద రొక్కమున్నదో కన్గొని రమ్ము. నేనును, ప్రయత్న పరుఁడనై, నాపలుకుబడిచేతను, నా సౌహార్ద్రితచేతను నీకు వలయు ధనము సమకూర్చెదను.

[నిష్క్రమింతురు]



# ఇందిరా వసంతము

## ప్రథమాంకము

### ద్వితీయరంగము — గోలకొండపురి

ఇందిరాదేవి మేడలో నొకగది.

ప్రవేశము : ఇందిర, నీలవేణి.

ఇంది : నీలా, నాచిన్నతనువీ పెద్ద ప్రపంచమందు విసివి వేసారి యున్నదే.;

నీల : ఎందుకుదేవీ ? నీ కంతటికష్టములేమున్నవి ? నీకేమి సుఖము తక్కువయ్యెనా ? అబ్బా ! అతిభాగ్యశాలురు నైత మతిదరిద్రుల వలెనే కుందుచుందురు. "అతి సర్వత్ర వర్జయేత్" అని పెద్దలు పలుకుట వింటివి కదా !

ఇంది : చాలుచాలులే, నీ నీతులు ! మాటలలో నింతటిజాణతన మెక్కడ నేర్చితివే నీవు ?

నీల : ఆ నీతులప్రకార మాచరించిన బాగుండును గదా !

ఇంది : నీలా, అదినిజమేకాని, చెప్పినట్లు నడచుకొనగల్గినచో నింకేమే ! గుడిసెలు మేడలుగామారవా, భూతలము స్వర్గలోకమైపోదా ? ఉల్లి గడ్డలు నిషేధమనిబోధించిన పౌరాణికుఁడేవాటిని వర్జింపఁగలిగెనా? పదుగురకు నీతులుబోధించుట సులభము. ఆ నీతినే నేనాచరించుట కష్టతరము. ఈ మీమాంస నాకెందుకులే ! దీనివలన నా స్వయం వరమున కేమైన నుపయోగమున్నదా ? అబ్బా ! ఇది స్వయంవర మెట్లగును ? నేను ప్రేమించు పురుషునిగై కొనుటకుఁగాని, నే నొల్లని వానిని మానుటకుఁగాని నా కధికారములేదు గదా ! ఆహా ! స్వర్గ స్థుడైన తండ్రి యభీష్టము జీవించియున్న పుత్రికాభీప్సితము నెట్లు బంధించినదే !

నీలా ! ఈ వరణమున నాకు స్వాతంత్ర్యమించుకేనియు లేదుగదా?

నీల : అమ్మా ! నీ తండ్రి సద్వర్తనుఁడు. అట్టివారి కవసానసమయమందు దివ్యదృష్టిపొడముసు. అతఁడేర్పఱచిన యీ మూడుపేటికలలో నిర్దేశింపఁబడిన దానిని దప్పక కోరికొనఁగలుగు పురుషుఁడు నీప్రేమ కుఁబాత్రుఁడగు ధీరోదాత్తుఁడుగాకుండునా? ఇప్పటి కరుదెంచిన రాకుమరులఁగూర్చి నీ వేమనుకొంటివో నాకుఁదెలుపఁగూడదా ?

ఇంది : వా రెవరెవరో నీవుచెప్పిన, నేను వారినొకరొకరిని వర్ణించెదను. అప్పుడు నీవే నామనస్సు గ్రహింపఁగలవు.

నీల : తొలుత సింధుదేశాధిపతి కలఁడు.

ఇంది : ఆదేశము జాతిగుఱ్ఱములకుఁబేరెత్తినది. ఆ రాజునకు వాటిప్రసక్తి తప్ప వేఱువిషయముబొత్తిగఁదెలియదు. తాను స్వయముగ వాటికి లాడములు కొట్టఁగలుగుట వానిగొప్పబడాయి !

నీల : ఐతే, కుంతలేశ్వరుఁడో ?

ఇంది : మిడిగ్రుడ్లతో సుఱిమిచూచు తననే వరింపుమని నన్ను బెదరించు నటులున్నాఁడు. వానికిని హాస్యరసమునకును వైరమేమో ? యౌవ నముననే యిటులున్నవాఁడు వార్ధక్యమున శుష్కవేదాంతిగాకుండునా? వీరిరువురికన్న యమధర్మరాజును వరించుటమేలు. పరమేశ్వరుఁడు నన్ను వీరిబారినుండి రక్షించుఁగాత !

నీల : మఱి, నేపాళచక్రవర్తి నేమందువో ?

ఇంది : వానికిమానవజన్మమొసఁగినదిబ్రహ్మదేవునితప్పు. నేనువెక్కిరించఁ గూడదు కాని వానిలో విశేషాంశమేమందువా, లోకములోఁగల వెఱ్ఱిచేష్టలన్నియు వానిలో మూర్తీభవించియున్నవి. వానిని బెండ్లా డుట నూర్వురు భర్తలను బెండ్లాడుటయే ! అతఁడు నన్ను వరింప కున్నచో, నాకు మహోపకారము చేసినవాఁడగును.

నీల : దేవీ ! పాండ్యదేశపు యువరాజు నేమందువు ?

ఇంది : నీలా ! నేనేమనఁగలను ? వాని బాసమనకుఁ దెలియదు. మన భాష వానికిరాదు. సుందరవిగ్రహమే, కాని మూగప్రతిమతో నే నేమి మొత్తుకొందునే ?

నీల : అయితే, అతఁడు సరియైనపెట్టైను గోరికొన్నయెడల నీవాతనినిరాకరించి, నీ తండ్రిమాట జవదాటఁగలవా? కాని నీకు భయ మక్కఱ లేదు. నీవరాన్వేషణపద్ధతివీరెవ్వరికి నచ్చలేదు. వారు తమ స్వస్థానములకు మరలిపోవ నిశ్చయించితిమని నాకుఁ దెలియఁజేసినారు.

ఇంది : నా తండ్రి యాదేశానుసారము నేను నాజీవితేశ్వరుని వరింపఁజాలనేని నా యావజ్జీవము నేనాయుషఃకాంతవలెఁ గన్యాత్వము స్వీకరించి యుండెదను. తమదేశములకువెళ్ళఁదలచిన యీ నల్వురు రాకొమరుల యెడ నాకు మోహముపుట్టలేదు. కాన వారు సురక్షితముగ స్వగృహములఁజేరునటులఁ బ్రసాదింపుమని నేను దేవుని వేడుచున్నాను.

నీల : దేవీ ! నీ తండ్రి జీవించియున్నపుడు వేంగిదేశాధిపతితోఁగూడ నొకసారి విజయనగరమునుండి యిచ్చటికి వచ్చియుండిన యువకుని నీవు మఱచితివా ? అతడు మహాయోధుఁడును, దత్త్వజ్ఞుఁడును.

ఇంది : అవునవును ! అతని పేరు వసంతయ్య గదా !

నీల : నిజము, దేవీ ! నేను చూచినంతలో నీవంటి సుందరాంగికిఁదగిన వరుఁడతఁడేనమ్మా !

ఇంది : నీలా ! నా కతఁడు చక్కఁగ జ్ఞప్తియున్నవాఁడు ! అతఁడు నీ స్తోత్రమునకుఁబాత్రుఁడేనమ్మా !

ప్రవేశము :— ఒక సేవకుఁడు.

ఏమిరా ! సమాచారమేమి ?

సేవ : ఆ నలుగురు రాజులు మీ సెలవుకొఱకు కాచుకొనియున్నారు. మఱి యెవఁడోవేగువచ్చి, మచ్చదేశరాజుగారొస్తున్నారనిచెప్పియెల్లినాడు.

ఇంది : " గతకాలముమేలు వచ్చుకాలముకంటెన్ " అన్న సామెత యీ మత్స్యాధిపతి కన్వయింపకుండుఁ గాక !
ఒక వరుని నిష్క్రమణముతోఁగూడ, యిప్పుడే యింకొకవరుని ప్రవేశము ! [తూర్యనాదము చెలరేగును]

[మత్స్యదేశాధిపతి సపరివారముగఁ బ్రవేశించును]

మత్స్య: దేవీ !

ఉ॥ నల్లనివాఁడ, నొల్లవొకొ నన్ను ? సుభూషిత కన్యకామణుల్
నల్లనిమేనివెన్నునభినందన సేయరె ప్రేముడిన్ జెలీ ।
చెల్లరునాకు సామ్యము వశీకృతసాహసశౌర్యరీతులం
దల్ల ప్రశీతదేశములయందలి బాహుబలాఢ్యు లెల్లరున్ ॥

ఇంది : ఆర్యా !

ఉ॥ కన్నియకంటి కింపయినకాంతునిఁ గోరుపథంబునాకులే ;
దెన్నఁగమార్గమొక్కటి విధించెను మజ్జనకుండు ; దానిసే
మన్ననసేయఁగావలెను ! మాన్యుఁడు మత్పిత ; యాజ్ఞయిట్లుగా
కున్నమిమున్ నృపేతరుల నొక్కవిధంబునఁ జూడనాకగున్ ॥

మత్స్య: ఆహా !

మ॥ బలవద్వైరుల భూమిపాలకుల మద్బాహుప్రభావంబుచే
నిలలో నెందఱనోజయించితిని : యింతీ ! నిన్నుఁజేపట్ట బె
బ్బులి భల్లూకము సింహమున్, శరభమున్ బోరాడినేగెల్తుఁగొం
దలమయ్యేన్ మదియీయపూర్వవర సంధానంబు భావింపగన్ ॥

ఇంది : ఆర్యా, యీ యెన్నికలో మీరోడినచోఁబిదప నా వివాహవిషయము మాటాడనని ముందుగ మీరు శపథ మొనర్పవలెను. కనుక బాగుగ నాలోచింపుఁడు.

మత్స్య: అటే కానిమ్ము దేవీ !

ఇంది : తొలుత దేవాలయమునకరిగి, పిదప భోజనమారగించి రావచ్చును.

మత్స్య: నా యదృష్టమెటులున్నదో ! [నిష్క్రమింతురు]

(తూర్యనాదము)

# ఇందిరా వసంతము



## ప్రథమాంకము

## తృతీయరంగము

~~~o~~~

విజయనగరమున బహిరంగస్థలము.

ప్రవేశము : వసంతుఁడు, మార్వాడీ సేటు.

సేటు : మూడువేలవరహాలా ! సరే,

వసం : అవును; మూడుమాసములు గడువు.

సేటు : మూడునెలలా ! సరే.

వసం : దానికి సత్యమూర్తి పూచీయని నేనిదివరకే తెల్పితిని.

సేటు : సత్యమూర్తిపూచీమంచిదే.

వసం : కనుక మీమాట నిశ్చయమేకదా.

సేటు : మూడువేలవరహాలు, మూడునెలలుగడువు, సత్యమూర్తిపూచీ.

వసం : మీరందుల కంగీకరించినటులేనా !

సేటు : సత్యమూర్తి మంచివాఁడే.

వసం : కాదని యెవరనఁగలరు ?

సేటు : లేదు లేదు! అతఁడు మంచివాఁడనుటలో నాయభిప్రాయమతని పూ
చాలుననియే. కానివానిస్థితి ప్రస్తుతము సందేహాస్పదముగ నున్నది
వాని యోడలు సింహళము, చైనా, అరేబియా, పోర్చుగల్లుదేశమ
లకు వెళ్ళియున్నవి. ఏమైనను సరే, ఆసామి ఫరవాలేదు. మూడువే
వరహాలకువానిచేతఁబత్రమువ్రాయించుకొనవచ్చునని తలఁచెదను.

వసం : తప్పక మీరటు లొనర్పవచ్చును.
~~~

నేటు : అందుకు తప్పను. ఐనను నేను పర్యాలోచనచేసెదను. నేను సత్య మూర్తితో మాట్లాడవచ్చునా ? (ప్రవేశము : సత్యమూర్తి)

వసం : అదిగో, సత్యమూర్తి యిచ్చటికే వచ్చుచున్నాడు.

నేటు : (స్వగతము) "అతివినయం ధూర్తలక్షణం" అన్నమాట వీనికి సరి పోవును. వీనిపై నాద్వేషమునకు మొదటికారణము వీఁడు రసపుత్రుఁ డగుటయే. మఱి, వీఁడు విజయనగరపౌరులకు వడ్డీలేకయే ఋణము లిచ్చి, యితర సాహుకార్లకు నష్టముకలిగించుటచే, వీనింజూడ నాకడుపుమండుచున్నది. ఒకసారి నాచేతఁజిక్కెనేని వీని పొగర ణఁచి నాకసితీర్చికొందును. నా జాతిపై వీనికి మిగుల ద్వేషము. నేను వడ్డీవ్యాపారము చేయుదునని వీడు నన్ను మిక్కిలి దూషించు చుండును. నే నీతని సహించియుండుట నా జాతివారికి నేను ద్రోహ మొనర్చుట గదా ! (ప్రకాశముగ) అయ్యా ! ఇప్పుడు నావద్ద నెంత ధనమున్నదో యోజనచేయుచుంటిని. ఈ క్షణమే, మూడువేలవర హాలు నావద్దలేవు. అయిననేమి ? నాస్నేహితుఁడు గోకులదాసువద్ద సరిచేసెదను. ఎన్నినెలలు గడువు కోరితిరి ?

(సత్యమూర్తితో) ఓహో ! మీకు నూరేండ్లాయుస్సు, మీ విషయమే మేమిపుడు మాటాడుచుంటిమి.

సత్య : వడ్డీయిచ్చుటగాని, వడ్డీపుచ్చుకొనుటగాని నాకు సరిపడదు. ఐనను నా స్నేహితుఁడు వసంతు నవసరముచే నేను నాపద్ధతికి భిన్నముగ నడువ వలసివచ్చినది. (వసంతునితో) నీకెంతద్రవ్యము కావలెనో వీనికిఁ దెలిపితివా ?

నేటు : ఆహా ! మూడువేలు వరహాలు.

సత్య : మఱి, మూడు మాసములు గడువు.

నేటు : అవునవును. సరే, మీ పత్రము తెచ్చితిరా ? మఱి, మీ రిప్పు డేమంటిరి ? వడ్డీబేరము చేయనంటిరి గదా !

సత్య : అవును. అది నాకిష్టములేదు.

సేటు : అయితే సత్యమూర్తీ! యిది విను.

మ॥ మను పారాశర ధర్మశాస్త్రములు సమ్మానంబు నొందెం బళే!
వినుతిం బొందెఁగ, యర్థశాస్త్రరచనన్ విప్రుండు చాణక్యుఁడున్!
వినవో నీవు ధనార్జనాది విధులన్ వీరేల శాసించిరో!
ఘన గోపాలకుఁడేల పాల్ పెరుగు మీగళ్ళన్ హరించెన్ భువిన్॥

సత్య : గోపాలకృష్ణుఁడు వెన్నదిన్నవిధము నీవడ్డీవర్తకమునకు సాటియా? ఆహా! ఎట్టి సామ్యము! పూర్వము రాక్షసులు తమ క్రూరచర్యలకు వేదవాక్యములనే ప్రమాణముగఁ జూపిరఁట!

సేటు : దానికేమి గాని మూఁడువేల వరహాలు, మూడు మాసములు గడువు. సరే గాని వడ్డీమాట యేమనెదవు?

సత్య : ఒకే మాట. నీవు ఋణ మివ్వఁదలచితివా? లేదా?

సేటు : అయ్యా! నీవు నన్నెన్నిసార్లు బజారులో నిరసించియుండలేదు? నా ధనమును, నా వడ్డీవ్యాపారమును నీవు దూషించినను, నేనోర్చుకొని యుంటిని. ఓర్పు మాజాతిచిహ్నము. నేను నాస్తికుఁడనని, మోసగాఁడనని, నన్ను దుర్భాషలాడియుంటివి. అట్టి నీకు నా సహాయమిప్పు డవసరమైనది.

సీ॥ తామసంబున నీవు తమిదీఱఁ దఱుచు నా
వదనంబుపై నుమ్మివైచినావు
ప్రొయ్యిలోఁ బన్నుండు పొరుగుకుక్కనుబోలె
శిక్షించితివి పాదరక్ష నన్ను
అంతటి నీ విప్పు డప్పుగోరినవాఁడ
వేమనఁగలవాఁడ నేను నీకు
ముంగిటికుక్కకు మూఁడువేల వరాల
యర్థమున్నదె యని యడుగరాదె
లేక, నీ దాసుఁడ, నీకు సలాము లం
చతివినయోక్తుల నాడు మనెదొ

గీ॥ "అయ్యా నాపయి నుమిసితి వల్లనాఁడు
కొట్టితివి నన్ను దూరుచుఁ గుక్కయనుచు
నట్టి మన్ననలకుఁ బాత్రమైన నేను
ఇచ్చెదను నీకు ఋణము కొమ్మిదె" యటంచు ॥

సత్య : ఏమయ్యా! మాటలచే నన్నెత్తిపొడిచెదవా ?

చం॥ నిను నసె దూరెదన్ మఱల, నీపయి నట్టులె యుమ్మివైతు నిం
కను దఱివచ్చి నప్పుడును; గావున నాకిపు డప్పు నిచ్చుచో
మనమున నన్ను నీ విహితుమాత్రుగ నెంచకు; స్నేహజీవనం
బనయము వడ్డివర్తకము నంటగఁజాలదు మారువాడిరో ॥

కావున నీవు నన్ను శత్రువుగ భావించి నాకు ఋణమిమ్ము. గడువు మీరినచో మోమోటము దక్కి యపరాధము గైకొనుము.

సేటు : ఏమయ్యా! నీకేల యింత కోపావేశము ? సత్యమూర్తీ! నీవు నా కొనర్చిన యవమానము నంతయు మఱచినవాఁడనై నేను నీ చెలిమి కోరి నేడు నీ కోర్కెఁ దీర్చెదను. ఈ యప్పునకై నేను నీవద్ద నొక్క చిల్లిగవ్వయైన వడ్డీ తీసికొనను.

సత్య : నిజముగ నంతటి దాక్షిణ్యమా!

సేటు : నే నాడిన మాట తప్పను. నీవు పత్రము వ్రాసియిచ్చినఁ జాలును. కాని దానిలో నొక చిన్న షరతునుంచుము. నియమితకాలములో నీవు చెల్లింపనియెడల నీ దేహములో నేఁ గోరినవైపున నొక సేరు మాంసమును నేను కోసికొను హక్కు నా కుండవలయును. ఇది వట్టి తమాషాకే సుమా!

సత్య : ఈ తమాషా చాల బాగున్నది. నా కాక్షేపణలేదు. ఈ మార్వాడీ కింతటి దాక్షిణ్యమున్నదని నే నెఱుంగను.

వసం : సత్యమూర్తీ! నాకొఱకై నీవిట్టి షరతుగల పత్రము వ్రాసియిచ్చుట తగని పని. నా కష్టమును నే నెటులో భరించెదను.

సత్య : వసంతా ! భయపడెదవేల ? నేను గడువు మీరెదననియా ? ఇంక రెండునెలలలోగా నీ మొత్తమునకుఁ బదింతలాదాయము నాకు రానున్నది.

సేటు : ఈ రసపుత్రులతికఠినచిత్తులగుటచే, వారితరులయందు నైత మట్టి కాఠిన్యమారోపింతురు. అయ్యా ! ఈ షరతువలన నాకేమి లాభము రాఁగలదు ? ఒక శేరు నరమాంసమునకు గొడ్డుమాంసమునకున్న వెలకూడ లేదు. సత్యమూర్తితో స్నేహమభిలషించి నే నీ సాయ మొనర్చుచున్నాడను. ఇష్టమున్నఁ గైకొనుఁడు. లేకున్న దయ చేయుఁడు. నన్నుమాత్ర మనుమానింపవలదు.

సత్య : నా కంగీకారమే !

సేటు : ఐనచోఁ, బత్రము వ్రాసి కాఁగానే డబ్బిచ్చెదను.

సత్య : అటులేకానిమ్ము. (సేటు నిష్క్రమించును).

వసం : ఈ కుటిలాత్ముని వైఖరి నాకు నచ్చలేదు. వీఁడు పయోముఖ విషకుంభమువలె నున్నాఁడు.

సత్య : రావయ్యా ! వసంతా ! దీనిలోఁ జిక్కులేమియుఁ గలుగవులే. గడువు తీరుటకొక మాసము ముందే నా యోడలు మరలిరాఁగలవు.

[నిష్క్రమింతురు]

---

# ఇందిరా వసంతము

## ద్వితీయాంకము

### మొదటిరంగము:— విజయనగరమున నొక వీధి

[ప్రవేశము — బసవయ్య]

బస : సావుకారి చేతుల్లోంచి తప్పించుకోడానికి మనసు గెట్టిచేసుకోక తప్పదు. కాలికి బుద్ధి నెప్పాల్సిందే. వాడు దయ్యాపుముండా కొడుకు. వాడిదగ్గరనుంచి పారిపోవటం మంచిది. నే నిప్పుడే బయల్దేర్తా.

[గూని తాత బుట్ట నెత్తినపెట్టుకొని ప్రవేశము]

గూని: అయ్యా, ఒక్క మనివి. ఆ సేటుయింటికి దోవసూపయ్యా!

బస : అరే! వీడు మా నాయనే. గుడ్డోడు గనుక గుర్తుపట్టలేదు. వీణ్ణి తమాష్ పట్టిస్తా.

గూని: ఏమయ్యా, సేటు మేడకు దారి యెటయ్యా!

బస : ఇటెల్లి కుడితట్టు తిరిగి తర్వాత యెడమవైపు యీదిగుండా యెల్లు. ఆపైని కునిలోనుంచి చక్కంగా తిన్నగాయెత్తే వస్తుంది సేటుమేడ.

గూని: ఓ సామి, దోవ సరిగా తెల్సేతట్టులేదే! ఆ సేటుయింట్లో బసవయ్య వుంటాడా?

బస : ఓహో, బసవయ్యగారా?

గూని: గారనవద్దండీ! వాడో బీదోడు. వాడినాన్న సత్యకాలంమనిషి కాబట్టి దేవుడిదయవల్ల యింకా బతికివున్నాడు.

బస : వాడి నాన్నసంగతి మనకెందుకులే! వాణ్ణేగదా నీ వడిగేది?

గూని: ఆ, వాఁడే ! నీ నేస్తకాఁడు బసవయ్య.

బస : అయ్యో, ముసలబ్బీ ! వాడి తలరాత అట్లావుంటే మనమేంజేస్తాం ! వాఁడు సచ్చిపోయాడు.

గూని: రామ రామ ! అబ్బా నేను ముసలోడినై పొయ్యాను. నన్ను వాఁడు పోషిస్తాడనుకొంటిని. నాకు వాఁడు కాస్త చేతికింది కాదరు వనుకొంటినే.

బస : అయ్యో ! వాడిబదులు నే నుంటానులే. నే నెవరో తెలుసా ?

గూని: ఇవాళ పాపిష్ఠిదినం. మీ రెవరో నాకుఁ దెలియదు. దయచేసి చెప్పండి బాబూ ! నా కొడుకు బతికివున్నాడా, చచ్చిపోయాడా ?

బస : యెర్రినాయనా, న న్నెరగవా నీవు ?

గూని: నేను గుడ్డి కబోదిని. నా కేం తెలుస్తుందీ ?

బస : నీకు సూపు సరిగావున్నాకూడా నీ విప్పుడు నన్ను గుర్తుపట్టలేవు. ఇంక చాలు తమాషా. నాయనా నన్ను దీవించవూ ? నేనే బసవణ్ణి.

గూని: ఓరి నీ తస్సగొయ్యా ! నీవేనటర్రా ! ముండాకొడుకా !

బస : అదేమో నాకు తెలీదు. నేటుదగ్గిరవుండేది నేనే. మా అమ్మ పేరు మాచమ్మ.

గూని: అది నా బార్యే ! నీకెంత గడ్డమొచ్చిందిరా? ఏమి మారినావురా నీవు? సావుకారేమంటారు ? అయనగారికి నేనొకకానుక తెచ్చానురా !

బస : పిచ్చినాయనా ! నే నా నేటును వదిలేస్తున్నా. వాడికెందుకు బహుమానం ! వాణ్ణి ఉరితీసినా పాపంలేదు. వాడిదగ్గర కొలువు కొలిచి నేను తిండిలేక మలమల మాడి సచ్చాను. నాన్నా ! ని న్నిపుడు చూడటం నాకెంతో సంతోసం. నీవు తెచ్చిన కాన్క వసంతయ్య గారి కిద్దాఁ ! ఆయనదగ్గిర నేను సేవకుణ్ణిగా వుంటాను. అబ్బ ! ఏమి నా భాగ్యం ! అదుగో వసంతయ్యగారొస్తున్నారు,

[ వసంతుఁడు గోపాలునితోఁ బ్రవేశము ]

బస : నాన్నా, వారే వసంతయ్యగారు.

గూని : బాబుగారూ ! వీఁడు నా కొడుకు. బీదోడు.

బస : నేనా ! గొప్ప సేటు గుమాస్తాను.

గూని : అవును. కాని వాడికి సావుకారికి పొత్తు పొసఁగలేదు.

బస : సేటు నా కన్యాయంచేశాడు గనుక నేను వాణ్ణి వదిలేసి వసంతయ్య గారి సేవ చేస్తాను.

గూని : అయ్యా ! ఇదిగో నే నిచ్చేకానుక యీ నిమ్మపండు పుచ్చుకోండీ !

వసం : లక్షాధికారి సేటును వదిలేసి. పేదవాఁడైన నన్ను సేవించడం నీ కిష్టమైతే సరే.

బస : అయ్యా ! దేవుఁడి దయవుంటే చాలు. డబ్బెందుకండీ !

వసం : బసవయ్యా ! నీవు సేటుదగ్గరకు వెళ్ళి నౌకరి చాలించుకొని రా.

బస : నాన్నా, రా పోదాం. నాకు మాటలు రావని, నౌకరి దొరకదని నీ వనుకొంటివి గదా ! నా అదృష్టం మంచిది. నేను నూరేండ్లు బతుకుతాను. నాకు పదిహేనుమంది భార్యలు. పెద్ద గండాలు మూడు తప్పిపోతాయి. చిన్నచిన్నవి లెక్కలేదు. పెండ్లి ఒక పెద్ద గండం. నా అందాని కీవేషం చాల్లే ! ఒక్క నిమిషంలో సేటుదగ్గిరకెళ్ళి సెలవు తీసికొస్తాను.

[ అందఱు నిష్క్రమింతురు ]



# ఇందిరా వసంతము

## ద్వితీయాంకము

## ద్వితీయ రంగము

మార్వాడీ సేటుయింట్లో నొక గది.

ప్రవేశము :— చంద్రరేఖ. బసవయ్య.

చంద్ర : నీవు వెళ్ళిపోతే నే నింక దుఃఖము పట్టలేను. అప్పుడు నా కీ యిల్లు నరకమే. నీవు నన్ను ఓదార్చుచుంటివి. సరే ! వెళ్ళిరా ! ఇదిగో యీ వరహా నీవు తీసికో ! మీ పంతులుగారింటికి సుందరేశం రాఁగానే, అతనిచేతికి నీ వీ జాబు నిమ్ము. ఎవ్వరు చూడకుండ. జాగ్రత్త. నేను నీతో మాట్లాడినది గూడ మా అయ్య చూడఁ గూడదు.

బస ! అమ్మా ! చిత్తము. నాకు నోట మాటరాకున్నది. నా దుఃఖము చెప్పితే తీరదు. నీ చక్కఁదనము, నీ సుగుణము నేను మరవఁ గలనా ? అబ్బా ! తల్లీ సెలవు.

చంద్ర : సరే లే, బసవయ్యా ! (బసవయ్య వెళ్ళిపోవును).

(స్వగతము) అయ్యో ! నే నెంతటి ఘోరపాపిని ? నేను నాజనక తండ్రినే దూషించుచుంటినే ! కాని వాని దుష్ప్రవర్తన, సారము లేని యీ సంసారము నన్నుఁ బ్రేరేపించినవి. ఆహా ! సుందరేశా ! నా ప్రాణప్రియా ! నా ప్రేమబంధమును గుర్తించి, నన్ను రక్షించుటకు నిర్ణయించిన మార్గమును నీవు విడువవలదు.

(నిష్క్రమించును).

[ మార్వాడీ సేటు ప్రవేశించును ]

సేటు : వసంతయ్యకు నాకుఁగల భేదము వీనికిఁ ద్వరలోఁ దెలియఁ గలదు. నా వద్ద వీఁడు తన యిచ్చవచ్చినట్లు తిని తిరుగుచుండెను. వసంతుని వద్ద వీని యాటలు సాగవు. చంద్రరేఖా! చంద్రరేఖా!

[ చంద్రరేఖ ప్రవేశము ]

చంద్ర : నాన్నా, పిలిచితివా? ఎందుకు?

సేటు : చంద్రరేఖా! నేను వసంతయ్యగారింటిలో విందారగింప వెళ్ళు చున్నాను. అవిగో పెట్టెబీగాలు. ఇంటిలో జాగ్రత్తగానుండుము. నాకేమో పోవుట కిష్టములేదు. నా మనస్సు ప్రశాంతముగా లేదు. నిన్నరాత్రి నా కలలో ధనరాసు లగుపడినవి. ఐనను దప్పదు. ఇంటి తలుపు లోపలగడియవేసికో. కిటికీలుకూడ మూసివేయుము. వీధిలో వెఱ్ఱికేకలు వేయువారి వైపు తొంగిచూడవలదు. సరే. నేను వెళ్ళెదను. అమ్మాయీ! లోనికి వెళ్ళి తక్షణమే తలుపు మూయుము. జాగ్రత్త. (నిష్క్రమించును).

చంద్ర : నే నదృష్టవంతురాలనయితే, నాకింకెక్కడి తండ్రి, నీ కింకెక్కడి కూతురు?

(నిష్క్రమించును).



# ఇందిరా వసంతము

## ద్వితీయాంకము

### తృతీయరంగము — విజయనగరము

(మార్వాడీ సేటు యింటిముందర)

[కేశవరావు, శివరావు మారువేషములతోఁ బ్రవేశము.]

కేశ : మనల నీ మేడవద్ద వేచియుండుమని సుందరేశం చెప్పినాఁడు గదా!

శివ : వాఁడు చెప్పిన ప్రొద్దు దాటిపోలేదా ?

కేశ : అతఁడాలసించుట చిత్రముగ నున్నది. కాముకులు శీఘ్రగాములు గదా !

శివ : మన్మథుని రౌతులు నూతన వధూవరుల చెంత కతిత్వరితముగఁ బరువులెత్తునట !

కేశ : "క్రొత్త యొక వింత, ప్రాత యొక రోఁత" అన్న సామెత తెలియదా ?

శివ : అదిగో, సుందరేశం వచ్చుచున్నాఁడు. ఇఁక మన సంభాషణ చాలింతము.

[సుందరేశం ప్రవేశము]

సుంద : ప్రియమిత్రులారా ! ఆలస్యమైనందుకు క్షమింపుడు. ముందెప్పుడైన మీరుకూడ మీ ప్రియురాండ్రను రహస్యముగఁ జేరునప్పుడు నేను నిట్టులే కాచుకొనియుండెదను. ఇదె నా మామగారిల్లు. (తలుపు తట్టును). ఎవరు లోపల ?

(చంద్రరేఖ బాలకవేషమున మేడపై నుండును).

చంద్ర : ఎవరక్కడ ? మీ గొంతు తెలిసినది. ఐనను మీ రెవరో చెప్పినఁ గాని నేను నమ్మను.

సుంద : నీ ప్రియుఁడు సుందరేశం.

చంద్ర : నిజమే. నా ప్రేమకు గుఱి యింకెవ్వరగుదురు ? ప్రాణేశ్వరా ! నేను నీ ప్రేయసినని నీవు తప్ప మఱెవ్వ రెఱుఁగుదురు.

సుంద : నీ మనసే సాక్షి. మఱి, దైవమునకెఱుక.

చంద్ర : ఇదిగో, ఈ పెట్టె నందుకొనుము. "కష్టీ ఫలీ". ఈ గాఢాంధకారము కామాంధతకుఁ దోడ్పడుసు గాఁత.

సుంద : క్రిందికి దిగిరమ్మ, ఇంక జాగుసేయక తత్క్షణమే రమ్మ, రాత్రి వేళ ప్రొద్దగుచున్నది.

చంద్ర : నేను తలుపులన్నిఁటిని మూసికొని మఱికొన్ని వరహాలు తీసికొని వచ్చెదను. (నిష్క్రమించును).

కేశ : ఈ కన్య మార్వాడీయింటఁ దప్పి పుట్టినది.

సుంద : గీ॥ జ్ఞాన సౌందర్య ప్రణయ సంజ్ఞావిశేష
మనఁగ నొప్పెడు యిక్కన్య నస్మదీయ
చిత్తఫలకాన రచియించి చిత్రరీతిఁ
బ్రేయసీచిత్రపూజను బ్రీతిసేతు.

[చంద్రరేఖ క్రిందఁ బ్రవేశించును]

వచ్చితివా నీవు ! ఇఁక మనము పోదము.

(అందఱు నిష్క్రమింతురు).



# ఇందిరా వసంతము

## ద్వితీయాంకము

### చతుర్థరంగము — గోలకొండపురి

[ఇందిరాదేవి మేడలో నొక గది]

మంగళవాద్యము: ఇందిర, మత్స్యాధిపతి సపరివారముగఁ బ్రవేశము.

ఇంది: (సేవకునితో) పరదా లాగివేసి, అచ్చట నున్న పేటికల నన్నింటి ని రాజకొమరునకుఁ జూపింపుము. ఆర్యా! మీరింకఁ గోరికొన వచ్చును.

మత్స్య: (త్రిపాది) —

సీ॥ బంగారుపేటికపయిని వ్రాసినదేమి? "పలువురుకోరెడుఫలమునిత్తు"
ఈవెండిబరణిపై నేమివ్రాసినయది? "పాత్రతనెఱిఁగినేఫలమునిత్తు"
సీసంపుడబ్బిపై వ్రాసినదేమొకో? "అస్మదర్థిత్యజించుస్వార్థమెల్ల"
ఆహా! నేను సరిగాఁ గోరికొను మార్గము తెలియుటెటులో కదా!

ఇంది: రాజకుమారా! నా చిత్రపట మీమూడుపేటికలయం దొకదానిలో మాత్ర మున్నది. దానిని మీరు చేకొంటిరేని, నేను మీ ........

మత్స్య: భగవానుఁ డనుగ్రహించుఁ గాఁత! ఈ పేటికల నింకొకసారి పరికించెదను. సీసఁపుడబ్బి యేమనుచున్నది? తనను గోరువాఁడు సర్వస్వము ద్యజింపవలెనఁట! నిరుపయోగమైన యీ సీసము కొఱకై నే నేమియుఁ ద్యజింపఁజాలను. ఈ వెండి బరణిపై నేమి వ్రాసియున్నది? పాత్రత నెఱిఁగి ఫలము నిచ్చునఁట! మత్స్యరాజా! నీ బుద్ధికి నీవు పాత్రుఁడవే యైనను నీ పేకన్నియం బొందుటకుఁ దగిన పాత్రత నీకు లేకపోవచ్చును. సత్కుల, సదాచార, సత్కీర్తి, సద్భాగ్యవంతుఁడ నగుటచే నేను తగిన

వాఁడనే. అన్నింటికన్న నా ప్రేమచేత నేను మిక్కిలి తగి యున్నాఁడను. కావ నే నీ బరణినేల కోరరాదు ? ఐనను బంగారు పేటిక యేమనుచున్నది ? పలువురు కోరెడు ఫలము నిచ్చునఁట ! ఈ లోకమెల్ల యీ కన్యను గోరుచుండలేదా ? దిగంతములనుండి జను లీమెకొఱకుఁ దీర్థప్రజవలె వచ్చుచున్నారు. దుర్గమంబులైన పర్వతారణ్యభూములు నేఁడీ యిందిరాదేవి దర్శనార్థ మరుదెంచు రాకొమరులకు ఘంటాపథంబు లై వెలయుచున్నవి. ఆకాశ లక్ష్మితోఁ గోలాటమాడు మహాసింధువు సైత మొక చిన్నకాలువ వలె దాఁటి పరభూపాలు రీ సుందరాంగి విలోకనార్థ మేతెంచు చున్నారు.

ఈ మూఁడు పేటికలం దొక్కట నాతరుణీమణిది వ్యమంగళ విగ్రహమున్నది. అయ్యది నీచమైన సీసలోహపు డబ్బియందుండఁ జాలదు. కుందనముకన్నఁ బదిరెట్లు తక్కువయగు యీ వెండి బరణిలోఁ గూడ నుండదు. ఆహా ! ఈ యమూల్యరత్నరాజము స్వర్ణభూషితము గాకుండునా ? ఈ రంభాచిత్రము బంగరుపేటిక యందే కలదు. దీని తాళపుచెవినిమ్ము. నేను దీనిని గోరినాఁడను. ఇఁక నా యదృష్టము.

ఇంది : అదిగో దాని బీగము, తీసికొనుఁడు. నా చిత్ర మందుండెనేని నేను తమ .... (అతఁడు బంగరు పేటికను దెఱచును).

మత్స్య: హా ! దైవవిధీ ! ఏమిది ? ఈ పుఱ్ఱెకంటితొఱ్ఱలో నేమో వ్రాసిన చీటి యున్నది ! దీనిని జదివెదను,

గీ॥ మిసిమి దీపించునది యెల్ల పసిడి గాదు
నాఁగఁ బల్కులు వినలేదె, త్యాగశీల !
పలువురమ్మఁగ వినలేదె, ప్రాణములను
నాదు పైకప్పుఁ జూడంగ, నాన లేక.

గీ॥ ఎంత ధైర్యమ్ము చేకూరె, నంత జ్ఞాన
మబ్బియుండినచో యౌవనాంగ, నీకుఁ
బ్రతివచన మిది గాదు, నీ ప్రణయవాంఛ
కరుగు మిఁక మోహవైకల్య మతిశయించు.

అయ్యో ! నాపడిన శ్రమయెల్ల వ్యర్థమాయెనే ! ఉత్సాహ మడుగంటుచున్నది. హృదయము తల్లడిల్లుచున్నది. ఇందిరా ! సెలవు. అపారచింతాక్రాంతమనస్కుఁడనై నే నిప్పుడెక్కుడు మాటాడఁజాలను. (సపరివారముగ నిష్క్రమించును) .

ఇంది : అబ్బ ! ఇప్పటికిది సరసవిమోచనమే ! పద ! పరదా క్రిందికి లాగి వేయుము. ఈ మేనిచాయవా రంద రీతనివలెనే వరింతురుగాక !

[ సేవకుఁడు ప్రవేశము ]

సేవ : దేవీ ! శ్రీకేరళమహారాజుగారు వచ్చుచున్నారు.

[ మంగళవాద్యములు మ్రోయఁ, గేరళప్రభువు సపరివారముగఁ బ్రవేశించును. ]

ఇంది : ఉ॥ రాజవరేణ్య కన్గొనుము రాజిల్లుచున్నవి మూడుపేటికల్
ఫీజనవంద్య మీరు కడుదివ్య వశంబున నాదుపేటికన్
యోజనచేసి కోరికొను యోగముకల్గెనయేని నేను మీ
పూజయొనర్చి భార్యనయి పూజ్యుల మిమ్ముఁబరిగ్రహించెదన్ ॥

కేరళ : దేవీ! నేనిప్పుడు శపథముఁ జేసితినిగదా! అవును అందు మొదటిది నేనుకోరిన పెట్టెను మఱెవ్వరికినిఁ దెలుపఁగూడదు. రెండవది సరియైన పెట్టెను గుర్తించనియెడల నేను వివాహవిషయము మాటాడఁ గూడదు. ఇఁక మూఁడవది. నాప్రయత్నము విఫలమైన తక్షణమే నే నిచ్చటనుండి మరలివెళ్ళెదను.

ఇంది : నన్ను వరింపఁగోరువారెల్ల రీ నిబంధనల కొడంబడుదురు.

కేరళ : సరే నాకోర్కె లీడేరుఁగాక. స్వర్ణము, రజతము, సీసము— " అస్మ దర్థిత్యజించు స్వార్థమెల్ల" ఛీ! తుచ్ఛలోహమగు నిన్ను నే నొల్లను. ఓహో ! బంగారు పేటిక యేమను చున్నది ! " పలువురు కోరెడు

ఫలము నిత్తు." పలువురు కోరెడు ఫలమా ? ఆ పలువురను మాటకు లోకసామాన్యజనమని యర్థము. అట్టివారు తళుకుబెళుకులకు మోసపోవుదురు. కావున పలువురు కోరెడు ఫలము నాకు వలదు.

ఇఁక, రజతమందసమున్నది. "పాత్రత నెఱిగి నే ఫలము నిత్తు." సెభాస్ ! అపాత్రుఁ డెక్కువ ఫలితము కోరుట పాడిగాదు. గౌరవలాఘవములు పాత్రతాపాత్రతల కొలందులు. కాన నేను నాకుఁదగిన ఫలమునే పొందువాఁడను. దేవీ ! ఈ బరణితాళము చెవి నిమ్మ! పిమ్మట నా యదృష్టము. (అంత నతఁడు వెండిబరణి తెఱచును).

కేరళ : ఏమిది ! ఈమిణకరించుచున్న వెఱ్ఱివాని ఛాయాపటము నాకొక చీటీ నందించుచున్నది, దానింజదివెద. నా యాసలెల్ల భగ్న మాయెఁగా ! నాపాత్రతకుఁదగినదీపిచ్చిప్రతిమయేనా ?

ఇంది : కోపావిష్టులు సద్విమర్శన సేయఁజాలరు.

కేరళ : ఇదేమో చదివెదను.

పాట ॥ ముక్కాకఁదీర్చిన చక్కనివెండినా
జయమొందఁజేయు యోజన మూఁడుమారు
లవివేకులున్నవా రంతఃపురమున
నల్లె పైపూతతో నలరు నీబరణి
ఏను నీశిరముతో నేకమై యుందు
పొమ్ము నీవికనిప్డు పొమ్ము శీఘ్రంబ."

గీ॥ తెలివిహీనుఁడగా నేను తేలినాఁడ ;
నిచట నిఁక నొక్క క్షణమాత్ర మేను నిలువ ;
వెఱ్ఱితల యొంటిమై నేను వేగ వచ్చి
యినుమడించిన వెఱ్ఱినై చనెడువాఁడ ;
నాదు దౌర్భాగ్యమును సహనంబుతోడ

నోర్చి తప్పక పాలింతు నొట్టు వెట్టి
సెలవొసంగుము దేవిరో! సెలవు సెలవు.

(సపరివారముగ నిష్క్రమించును).

ఇంది : దీపము నాశించిన యిసుళ్ళ చందమైనది. ఈ బుద్ధిహీనులకుఁ దగిన ప్రతిఫలమే!

నీల : "భార్యాభర్తల బ్రహ్మ విధించుచు
ఫాలతలమ్ములఁ బసతో వ్రాయును."
అన్న సామెత యెన్నటికి నబద్ధము కాఁ జాలదు.

ఇంది : రావే! నీలవేణీ! పరదా లాగివేసి రా!

[ఒక సేవకుఁడు ప్రవేశించును.]

సేవ : దేవీ!

ఇంది : ఏమీ! ఏ ప్రభు వరుదెంచిరి?

సేవ : తల్లీ! తమ యేలిక వచ్చుచున్నాఁడని తెలుపుటకొక పసివాఁడు హజారమువద్దకు వచ్చియున్నాఁడు. వానిది విజయనగరమఁట. చాల మంచి కానుకలు తెచ్చియున్నాఁడు. అమ్మా! ఇంత మనోహరుఁడగు ప్రణయ దూతను నే నింతకు ముందు చూచి యుండలేదు.

ఇంది : "అంత్యశిశిరర్తు మధువసంతాగమంబుఁ
దోపఁజేసెడువిధమొ యీదూతరాక."
ఓరీ! ఇకఁ జాలు! నీ వాతనిఁ బొగడుటఁ జూడ నాకుఁ గొంత భయమగుచున్నది. అంతయుఁ జెప్పి చివర కతఁడు నీకు బంధు వనెదవేమోయని! నీలవేణీ! రా, రా, అట్టి మనోహరాకారునిఁ జూడ నాకునుఁ గుతూహల మొదవుచున్నది.

నీల : ఈ వలరాజు వసంతుఁడగుఁగాక!

[నిష్క్రమింతురు]

# ఇందిరా వసంతము

~~~~~~o~~~~~~

## తృతీయాంకము — ప్రథమరంగము

విజయనగరములో నొక వీధి

ప్రవేశము : భరతుఁడు, శివరావు.

భర : బజారులో నేమివిశేషము ?

శివ : సత్యమూర్తిగారినావ యొకటి చాలసరకుతోఁడ మునిఁగిపోయిన సంగతి నీవు వినలేదా !

భర : ఎంతవిచారకరవార్త ! అతఁడు వాస్తవముగ సత్యమూర్తియే ! అయ్యో ! పాప మట్టివారి కింతనష్టము కలుగుటెంత దురదృష్టమో!

శివ : ఆనష్టమొక్కయోడతో ముగిసిన మేలే !

భర : ఆ వచ్చుచున్నదెవరు ? (మార్వాడీసేటు ప్రవేశము)

ఓహో ! ఏమి విశేషాలు !

సేటు : మా అమ్మాయి లేచిపోయినసంగతి నీకుఁ దెలియునుగా !

శివ : అవును.

భర : ఱెక్కలు వచ్చిన పిదప పిల్లలు తల్లిపక్షిని విడిచి యెగిరి పోవుట సహజమే.

సేటు : నా కొమార్తెకు నటులేయైనది. నా కడుపునఁబుట్టిన కూఁతురే నాకు శత్రువైనది.

శివ : రక్తమాంసములలో నీకు నామెకుఁ జాలవ్యత్యాసమున్నది. అది పోనీ ! సత్యమూర్తికేమైన నష్టము కలిగినదా ?
~~~~~~

సేటు : నన్నాప్రకారము దూషించుచుండిన సత్యమూర్తి నేఁడేమొగము పెట్టుకొని బజారుకు వచ్చునో చూచెదనుగా ! అతఁడు నాకు వ్రాసియిచ్చిన పత్రమున్నదిలే !

శివ : పత్రమునందలిగడువు దాఁటినచో మీ రాతనిమాంసమును గైకొందురా ? అదెందుల కుపయోగించును ?

సేటు : మఱెందుకుఁగాకున్నను నా పగఁ దీర్చికొనుటకైనను నా కది కావలయును. అతఁడు నన్నవమానించి, నష్టపఱచి, గేలిసేసి యున్నాఁడు. నా జాతిని దూషించి, నా స్నేహితులను విడదీఁసి, నా విరోధులను బలపఱచియున్నాఁడు. ఇంతకును గారణమేమి ? నాజాతిమార్వాడీలకుఁ గండ్లు, కాళ్ళు, ముక్కు, చెవులు, గుణావగుణములు, మంచిచెడుఁగులు లేవా ? మార్వాడీలకుఁ దదితరులకు శీతోష్ణములందును, సుఖదుఃఖములందు నేమి భేదము ? సేటుకు రోషము లేదా ? నే నిపుడు దప్పక పగ సాధించెదను. (ఒక సేవకుఁడు ప్రవేశము)

సేవ : అయ్యా ! మా పంతులుగారు తమతో మాట్లాడుట కింటివద్ద వేచియున్నారు.

శివ : వారిని వెదకుచు మేము తిరుగుచున్నాము.

భర : అదిగో, ఇంకొకఁడు వచ్చుచున్నాఁడు. వాడే సేటుకు సరియైన చెలికాఁడు.

(శివరావు, భరతుఁడు, సేవకుఁడు నిష్క్రమింతురు.)

[ప్రవేశము : గోకులదాస్ ]

సేటు : గోకులదాసూ ! ఏమి విశేషము ? మా బిడ్డ జాడ యేమైనఁ దెలిసినదా ?

గోకు : ఆమెను గూర్చి అందఱు మాట్లాడువారే గాని వెదకి చూపించు వా రొక్కరును లేరు.

సేటు : అయ్యో ! అయ్యో ! ఒక మంచిరత్నము, రెండువేలవరహాలు, యింక నెన్నియో వెలగల సొమ్ములు ! అన్నియు ధారవోయెనే ! నా కూతురు చనిపోయినఁ గూడ నేనింతదుఃఖపడను. అబ్బ ! ఎంత నష్టము ! నే నేమి చేయుదును.

గోకు : సత్యమూర్తికిఁ గూడ కొంత నష్టము ప్రాప్తమైనది.

సేటు : ఏమీ ! ఏ మది ?

గోకు : సత్యమూర్తి సరకునావ మునిఁగిపోయినది.

సేటు : వాస్తవమా ! నిజమా ! దైవాధీనము.

గోకు : తప్పించుకొని ప్రాణాలతోఁ దిరిగివచ్చిన నావికునితో నేను మాట్లాడితిని.

సేటు : గోకులదాస్ ! నీవు బలేవాడవోయి ! నేను నీకెంతయుఁ గృతజ్ఞుఁడను. మంచివార్త నా చెవిని వేసితివి.

గోకు : నీ కొమార్తె మార్గమధ్యమున నొకపట్టణమున నొకరాత్రి నూరు వరహాలు సెలవు చేసినదఁట !

సేటు : అబ్బ ! ఈవార్త నాహృదయభేదిగానున్నది. నూరు వరహాలొక్కపూటకా ! నూరు వరహాలే !

గోకు : సత్యమూర్తి యిప్పుడు దివాలాతీయకతప్పదని పలువురువర్తకు లనుకొనుచున్నారు.

సేటు : అది నాకుఁజాలసంతోషకరము. నేనతనిని చిత్రవధ గావించెదను. అతఁడు నా ఋణము తీర్చనియెడల నేను వాని హృదయమును బెకలించివైచెదను. అతఁడే విజయనగరమున లేకున్న నేను గొప్పవ్యాపారము సాగింపఁగలను.

[నిష్క్రమింతురు.]

# ఇందిరా వసంతము

## తృతీయాంకము

## ద్వితీయరంగము — గోలకొండపురి

### ఇందిరమేడలో నొకగది

[ప్రవేశము: వసంతుఁడు, ఇందిర, కేశవరావు, నీలవేణి సపరివారము.]

ఇంది: ఆర్యపుత్రులు కొంచెము నిదానింపవేడెదను. ఒకటి రెండు దినములు గడువు గైకొనవచ్చును. తాము పొరపడినచో నేను తమ చెలిమిని గోల్పోవుదును. కావున కొంతసేపు మీరాగవలయును. నేను మిమ్ములను గోల్పోవనని నాకు స్ఫురించుచున్నది. అటుల తోఁచుట ప్రేమచేతనే గదా! నేను విశేషించి మాటాడుట నా కన్యాత్వమునకు భంగకరమగును. తాము పేటికనుఁ గోరి కొనుటకుఁ బూర్వ మిచ్చట నొకటి రెండు మాసములైనను జాగు సేయవచ్చును. సరిగా గోరికొను విధము నేను మీకుఁ దెలుపఁ గలను గాని యటులొనర్చుట నా ప్రతిజ్ఞకు భంగకరము. కాన నే నెన్నఁడు నటులొనర్పను. నన్ను మీరు కోల్పోయెదరేమో యనెడి భీతిచే నేను నా వ్రతభంగమున కొడిఁగట్టఁగలనా?

ఉ॥ కొంతను; త్వద్దృగంచలము కామజనైజముఁ గాంచె నామదిన్!
పంతమికేల? నే సగము భాగము నీవశమైతి; కాదొకో!
సంతసమొప్ప నా సగము సర్వము నీకు సమర్పణంబు కా
వింతు భవత్పదాబ్జముల వేసర కర్చన సేతుఁ బ్రీతితోన్॥

అయ్యో! క్రూర కాలమహిమ నేమనవచ్చును! అర్పణము సేసికొన్నను నేను మీదానను గాను గదా! నాలోప మేమియు లేదు. విధికృతము. వ్యర్థాలాపములతోఁ బ్రొద్దుపుచ్చినందుల కార్యపుత్రులు నన్ను క్షమింపవేడెదను. కాలహరణమే నా యుద్దేశము.

వసం : ఇఁక నాలస్యము సేయఁజాల. పేటికలున్న చోటికిఁ బోదము. పిదప నా యదృష్టము. (పరదా లాగఁగానే పేటికలు బయల్పడును).

ఇంది : ఈ పెట్టెలలో నొక్క దానియందు నే నున్నాను. మీరు నన్నుఁ బ్రేమించినచో నన్నుఁ బొందఁగలరు. నీలవేణీ : మీ రందఱు నిటు దూరముగ రండు.

(అతఁడు కోరికొనునపుడు సంగీతము విననగును).

—: పాట :—

1. కోరికొనక నన్గోల్పోయినచో
రాజహంసగతి రాగాలాపన
తోడ లీనుఁడై తూలు వసంతుఁడు ॥
అశ్రుపూర్ణమౌ ఆత్మీయద్వయ
నేత్రమె వానికి మృత్యుశయనమౌ ॥ కోరి ॥

2. జయము నొందుచో జయభేరిం బలె
నుదయరాగమై యొప్పును గానము ॥
రాజపుత్రవరరమణీప్రియులకు
మంగళవాద్యము మది ముద మొసఁగును ॥ జయ ॥
ఆర్యపుత్రుల విజయమే నా విజయము.

(వసంతుఁడు పేటికలను గూర్చి తనలోఁదాను విమర్శించును.)

—: పాట :—

మోహంబునకును మూలం బెయ్యది
హృదయ పీఠమో ? మెదటి సారమో ?
ఎచ్చట పుట్టునో ! ఎచ్చట పెరుగునో ?
తెల్పుము నాకిఁక; తెల్పుము వేగమె ? ॥ మోహం ॥
కంటిలోఁ బుట్టియు, కంటనె పెరిగియు
నయనడోలికన్నాశం బొందును
కామము పాయఁగ గానము సేయుద
మందఱ మొకటిగ నానందముగా. ॥ మోహం ॥

వసం : కావున బాహ్యాడంబరమునకును, వస్తుతత్వమునకును వ్యత్యాసము గలదు. ఈ సొగసైన బంగారును నే నొల్ల. దినదినము చేతిలో మెలఁగు వెండియు నాకు వలదు. భీతిఁగొల్పుచున్న యీ సీసమునే కోరెదను. ఇది నాకు సంతసకరం బగుఁగాక !

ఇంది : ఆహా ! సందేహ నిరాశాభీత్యసూయాది మన్మనోవికారభావములు పటాపంచలైనవి. ప్రేమజనిత సంతోష మినుమడించుచున్నది. దైవమా ! నా కీ యానందము శాశ్వతమగు నట్లనుగ్రహింపుము.

వసం : దీని యందేమి కలదో చూచెదను. (సీసపు బరణి తెఱచును). ఆహా ! అపర సుందరేందిర ! సజీవ యనునట్లు తోపించు దీనిని రచించిన చిత్రకారుఁడు దైవస్వరూపుఁడై యుండవలెను. దీని కన్నులు కదలుచున్నవా ? లేక నా దృష్టి భ్రమించుచున్నదా ? ఈ యధరామృత మెంత మధురము ! ఈ శిరోజములు మానవ హృదయములఁ జిక్కించుకొనుట కల్లఁబడిన వల యనునట్లున్నవి. చిత్రకారుఁడు దీని కన్నుల నింత సొంపుగా నెటులఁ దీర్చెనోకదా ! ఈ చిత్రలేఖనమే యింతరమ్యముగ నుండ, దీనికి మూలమగు జీవస్వరూప మిఁక నెటులుండునో చెప్పఁ దరమా ! ఈ పత్రిక యందేమి వ్రాసి యున్నదో చూచెదను. నా యదృష్టము ఫలించును గాక ! (చదువును.)

చం॥ భ్రమయకబాహికంబునకు భాగ్యము-మై-వరణీయపేటికన్
ప్రమదముతో వరించితిరి, ప్రాజ్ఞులు మీరు ; విభూషితాంగి యీ
రమణిని స్వీకరించి, మది రంజిలఁజేయుఁడు ; రాగవల్లరీ
సుమమధువానుతేటివలె, చుంబననేసి, ప్రియాధరోష్ఠమున్.

ఆహ్వానపత్రికయే సుమా యిది ! సుందరాంగీ ! అనుగ్రహింప వేడెదను. (ముద్దుపెట్టుకొనఁ బోగా ఇందిర సిగ్గునభినయించి. దూరముగా వెళ్లును). (నివ్వెరపాటుతో) ఆహా ! ఇదంతయు వాస్తవమా ? లేక కలయా ? నీవు ధృవపఱచినఁగాని నేను నమ్మఁజాలను.

ఇంది : మదీయ సౌందర్య సౌశీల్య సౌభాగ్యమ్ములు వేనకు వేలు మడుంగు లతిక్రమించినను, నేను భవచ్చెలిమిని బొరయుటకుఁ దగియుండను.

మ॥ అరయన్ విద్యయెలేదు; ప్రజ్ఞయును శూన్యాకారమే; కాని నా
తరుణ ప్రాయము; సూక్ష్మబుద్ధి, ప్రణయాంతశ్శుద్ధ చిత్తంబు సం
భరితా మోదముతోడ మీ వశము; నా భాగ్యంబు సర్వంబు మీ
పరమౌగాక; కరాంగుళీయకమిదే, పాయంగరాదెప్పుడున్॥

(అని యుంగరము నిచ్చును).

ఉ॥ ఇంతకుమున్నె నే రమణి నింపలరన్ సుఖభోగరాశినై
చెంతను సేవకుల్గొలువ, చింతయెలేక వసింపుచుంటినా
యంతిపురంబునందిక, మదాప్తగృహంబుచెలుల్ మదాత్మయున్
సంతసమొప్ప మీకుఁ బరిచర్య యొనర్చునుగాఁత, నిత్యమున్॥

వసం : తరుణీమణీ! నీదు వాక్చమత్కృతి వినినంత, సంతోషాతిరేకమున నాకు నోరాడకున్నది. కాని యీ యుంగరము నా కరాంగుళిం బాసినచో నా జీవిత మంతమొందునని నమ్ముము.

నీల : ఆహా! ఇప్పటికి, నాకోర్కెయు ఫలించెఁగదా యని మిక్కిలి సంతోషము. దేవీ! ఆర్యపుత్రులకును, మీకును శుభము శుభము.

కేశవ : ఆర్యా! తమ యదృష్టము నాకమందానందకరము. నా దొకవిన్నప మాలకింపుఁడు. ఈ సమయముననే నాకును బెండ్లి సేయుఁడు.

వసం : కన్య దొరికినచో నా యాక్షేపణయేమి?

కేశవ : మీ సహాయముననే నాకును వధువు లభించినందులకు నేను మీకుఁ గృతజ్ఞుఁడను. దేవిగారి చెలికత్తె నన్నుఁ బరిణయమాడ నిశ్చయించియున్నది.

ఇంది : నీలా! ఇది సత్యమేనా?

నీల : దేవిగారనుగ్రహించినచో ——

వసం : కేశవా ! నీ మాటలు మనఃపూర్వకమేనా ?

కేశవ : సత్యము.

వసం : మీ వివాహమువల్ల మా యానందమధికమైనది.

[సుందరేశుఁడు, చంద్రరేఖ, శివరావు ప్రవేశము.]

స్వాగతము ! దేవీ ! వీరు విజయనగర పౌరులు.

ఇంది : సుస్వాగతము !

సుంద : నమస్కారము. ఆర్యా ! దారిలోఁ గనఁబడిన యీ శివరావు ప్రోద్బలముచే నే నిచటికి రాఁగలిగితిని.

శివ : సత్యమూర్తిగారి యభినందనములఁ గైకొనుఁడు.

(ఒకలేఖ నందిచ్చును).

వసం : నా ప్రియస్నేహితుఁడు కుశలమేగదా !

శివ : లేఖ చదివినచోఁ దెలియఁగలదు!

(వసంతుఁడు జాబు చదువుకొనును).

కేశవ : నీలవేణీ ! ఆ వచ్చిన తరుణిని గౌరవింపుము.

ఇంది : ఆర్యపుత్రుల ముఖమై ఖరిచూడ లేఖయందు విచారకర వార్త లున్నట్లు తోచుచున్నది. ప్రాణస్నేహితుఁడెవఁడేని మరణించెనా ? లేకున్న, దృఢ మనస్కులగు వీరింతటి దైన్యమునకు లోనగుదురా ? ఆర్య పుత్రులు లేఖలోని వార్తల నర్ధాంగినైన నాకుఁదెలుప వేడెదను.

వసం : ప్రేయసీ ! నే నేమని చెప్పఁగలను ? తరుణీ ? నిన్ను నేను వలఁచి నపుడు నా కలిమియంతయు నేనేయని చెప్పియుంటినిగదా ! అంతే కాదు. నేను ఋణగ్రస్తుఁడ నని కూడ తెలిసికొనుము. ఏ నా స్నేహితుఁడు తన శత్రువునొద్ద ఋణముగైకొని నాకు సాయమొన ర్చెనో, ఆ ప్రాణమిత్రుఁడిపుడు కష్టములపాలై యున్నవాఁడు. శివరావూ ! అతని యోడలన్నియు మునిఁగిపోయెనా ?

శివ : అయ్యా ! వాస్తవము. మఱి యిప్పుడా సేటుకుఁ జెల్లింపవలసిన ధనము నిచ్చెదమన్న నాతఁడీయకొనఁడఁట. ఋణపత్రముపయి వ్యాజ్యమువేసి తీర్పుకొఱకు, వాఁ డహర్నిశము శ్రీ రాయలవారిని వేధించుచున్నాఁడు. ఎందరో వర్తకులు, రాజాస్థాన సభ్యులు, తుదకు రాయలునైత మాతనిమనసును మార్చ లేరైరి. పత్ర మందలి షరతు ప్రకారము తనకు న్యాయము జరుగవలెనని వాని పట్టుదలయఁట.

చంద్ర : ఆర్యులారా ! సత్యమూర్తి తనకివ్వవలసిన ధనమునకు నూఱింతలు పుచ్చుకొనుటకన్న, వాని మాంసశకలము తీసికొనుటే తనకోర్కె యని గోకులదాసుతో మా తండ్రి మా యింటఁజెప్పుచుండ, నేను వినియుంటిని. న్యాయచట్టము సత్యమూర్తికి సాయపడకున్నచోఁ దప్పక ముప్పు వాటిల్లును.

ఇంది : ఈ కష్టములఁ జిక్కియున్నది మీ ప్రియస్నేహితుఁడేనా ?

వసం : అవును, నా యనుంగు చెలికాఁడు. అంతేకాదు, దయార్ద్రహృదయుఁడు. ప్రాచీనహైందవధర్మబద్ధుఁడు.

ఇంది : ఆ సేటున కతఁడెంత బాకీ ?

వసం : నా కిప్పించిన మూడువేల వరహాలుమాత్రమే.

ఇంది : ఇంతేనా ? ఆరువేలిచ్చి పత్రము రద్దుపఱుపుము ; కాకున్ననంతకు రెండింతలు, మూడింతలు ధనమిచ్చియైనను మీ ప్రియమిత్రునిఁ గాపాడుట మీ విధ్యుక్తధర్మము, దయసేయుఁడు. తొలుత దేవాలయమునకరిగి యచట నాకు మాంగల్యధారణమొనర్చి తత్క్షణమే విజయనగరమునకుఁ బయనమగుఁడు. మీ యాత్మ శాంతపడిన గాని మన ప్రణయానుభోగము వలనుపడదు. మీ స్నేహితుని విడిపించుకొని వచ్చుటకు, ఋణమొత్తమున కిరువదింతలు ధనము తీసికొనివెళ్ళుఁడు. మీరు మరలివచ్చువఱకు నేను చక్రవాకమువలె నిరీక్షించుచుండెదను. గాఢయత్నమున నన్ను వరించిన మీపయి

నాకు గాఢతరానురాగముప్పతిల్లుచున్నది. మీ మిత్రుఁడు వ్రాసిన లేఖను నాకుఁజదివి వినిపించెదరా ?

వసం : (చదువును).

వసంతా ! ప్రియమిత్రమా !

" నా యోడలెల్ల మునిఁగిపోయినవి. ఋణదాతలు క్రూరులగుచున్నారు. నాకు భీదజీకము దాపరించినది. సేటుకు నేను వ్రాసి యిచ్చిన పత్రమునకు గడువుమీఱినది. ఇకఁదానిఁ జెల్లించుటకు నాప్రాణము నిలువఁజాలదు. కావున నా యవసానకాలమున నేను నిన్నొకమారు చూడఁగల్గినచో మన ఋణానుబంధము తీరును. కాని, నీవు నీ ప్రేయసి హితవు ననువర్తింపుము. "

ఇంది : ప్రాణనాథా ! తక్షణమే నీవు పయనమగుము.

వసం : " తరుణి ! నీ యాన ఘంటాపథమ్ము నాకు "; నేను వెడలివచ్చెదను ; వేవేగ మరలెద ! నా ప్రణయబంధ మేమాత్రము సడలదు.

(వసంతుఁడు నిష్క్రమించును).

సుంద : దేవీ ! ముఖస్తుతిమాటకాదు. వాస్తవముగ మీరు దైవాంశ సంభూతులరు. భర్తృవిరహసహనమే దానికిఁ దార్కాణము. తమసాహాయ్యమునకుఁబాత్రమైన సత్యమూర్తి గుణాతిశయములు మీకుఁదెలిసినచో మీ రొనర్చిన ఘనకార్య మమోఘమని గర్వపడఁదగును.

ఇంది : నా ప్రాణేశ్వరుని ప్రియమిత్రుని సౌజన్యమునుగూర్చి వేఱుగఁజెప్పనేల ? అట్టి మహానుభావుని ప్రాణాపదనుండి తప్పింపఁ బూనుట గొప్ప విషయముకాదు. ఆర్యా ! నా ప్రాణేశ్వరుఁడు మరలివచ్చువఱకు మీ రీ గృహమున వసింపుఁడు. నేనును, నా చెలి నీలవేణియుఁ గాళికాదేవి పూజయందు నిమగ్నులమైయుందుమని శపథము చేసియున్నాము. ఇచటికి రెండుమైళ్ళదూరమున నొక యతీశ్వరుఁడున్నవాఁడు. మే మచ్చటి కరిగి వారి పాదసేవ యొనర్చి వచ్చెదము.

సుంద : దేవీ ! తమ యాదేశానుసార మొనర్చెదను.

ఇంది : మేము తిరిగివచ్చువఱకు, నీవునుజంద్రరేఖయు నిచ్చట సుఖముగ నుండఁగలరు. చంద్రరేఖా ! నేను వెళ్ళెద. నీవు సుఖింపుము.

(సుందరేశం, చంద్రరేఖ నిష్క్రమింతురు).

ఒరే ! రామయ్యా, నీ వీ జాబుతీసికొని, పునహానగరమునకు వాయువేగ మనోవేగమునవెళ్ళి యచటనున్న మా బావగారు శ్రీ బలవంతరావుగారి చేతికిచ్చి వారొసంగు కాగితములను, వస్త్రములను దక్షణమే తీసికొని, మరలివచ్చి, విజయనగరమునకు వెళ్ళు దారిలోనున్న సత్రమువద్ద నన్నుఁగలిసికొనవలెను. నేను నీకన్నముందుగ నచ్చటికి వచ్చెదను. మాటలతోఁ బ్రొద్దుపుచ్చక వెంటనే బయలుదేఱి వెడలుము.

రాము : అమ్మా ! శీఘ్రమే పోయివచ్చెదను.

(నిష్క్రమించును).

ఇంది : నీలా ! రా, మనమిప్పుడు చేయవలసిన పని నీ కింకను దెలియదు. మన ప్రియులను జూతము, రమ్ము.

నీల : వారు మనలను జూచెదరా ?

ఇంది : చూచెదరు ; కాని మనయుడుపులు వారిని మోసపుచ్చును. మనలను వారు గుర్తింపఁజాలరు. మనమిరువురము పురుషవేషము దాల్చి నవయౌవనాంగులమై చూపట్టెదము. నేను పురుషపాత్ర నద్భుతముగ ధరింపఁగలను. మిగిలిన సమాచారము నీకుఁ బిదప తెల్పెదను. అశ్వశకటము మనకొఱకు వేచియున్నది. పద. రా !

[నిష్క్రమింతురు.]



# ఇందిరా వసంతము

---

## తృతీయాంకము

### తృతీయరంగము :— విజయనగరమున నొకవీధి

[ సేటు, భరతుఁడు, సత్యమూర్తి, చెఱరక్షకుఁడు ప్రవేశము ]

సేటు : ఒరే.! వాడిని వదలొద్దురా! వాడ్డీలేకుండా అప్పు లిచ్చేగనుడురా యీాడు !

సత్య : అయ్యా, దయచేసి నామాట కొంచెము వినండి.

సేటు : పత్రము ప్రకారము నేను వర్తించెదను. దానికి వ్యతిరేకముగా నాతోఁజెప్పవద్దు. ఇది నా శపథము. అకారణముగా నన్ను నీవు "కుక్క" యని తిట్టలేదా ? కనుక నేను కఱవక తప్పను. రాయల వారు నాకు న్యాయము కలుగఁజేయగలరులే !

సత్య : నామాట కొంచె మాలకించరాదా ?

సేటు : నేను వినను. నాపత్రమే నాకు శరణ్యము, కనుక నీవు మాటాడకు. నేను మీ మాటలకు మోసపోవు వాఁడనుగాను.

భర : ఇట్టి పిచ్చికుక్క నిదివఱ కెక్కడను గని విని యెఱుఁగను.

సత్య : ఛీ! ఇఁక వానితో మాటాడరాదు. వాఁడు నా ప్రాణము తీయఁగోరు చున్నాడు. కారణమేమో నాకుఁ దెలియును. నే నిదివఱకెందరినో వాని చెఱనుండి విడిపించియుంటిని. కావుననే వానికి నాపై ద్వేషము.

భర : రాయలవారు వాని పక్షమునఁ దీర్పు చెప్పరని నా నమ్మకము.

సత్య : రాయలు న్యాయశాస్త్రమునకు విరుద్ధముగ వర్తింపఁజాలరు. చట్ట తిరస్కార మరాజక కారణమగును. కాన నీవుపొమ్ము. నష్ట సముద్రమున మునిఁగి దుఃఖసాగరములోఁ దేలుచున్న నాకష్ట కాయమునుండి రేపొక సేరు మాంసముకూడ దొరకదేమో !

(చెఱరక్షకునితో) ఓరీ, పద ; దైవమా! వసంతుఁ డరుదెంచినచో నాకుఁ జిత్తశాంతి చేకూరును.

[నిష్క్రమింతురు.]

---

# ఇందిరా వసంతము

## చతుర్థాంకము — ప్రథమరంగము

విజయనగరము — రాజసభ.

వందిమాగధులు :— జయ, విజయీభవ, శ్రీ శ్రీ శ్రీ విజయనగర సామ్రాజ్యధురంధర శ్రీ కృష్ణదేవరాయలకు జై !

[రాయలు ప్రవేశము.]

(అందఱు లేచి నిలుచుందురు).

రాయ : (ఆసీనుఁడై) సత్యమూర్తి యెవరు ?

సత్య : మహాప్రభూ ! చిత్తము.

రాయ : ఈ వ్యాజ్యమునకు నీవేమి సమాధాన మొసంగఁదలఁచితివి ? నిన్నుఁజూడ నాకు మిక్కిలి జాలి పొడముచున్నది.

సత్య : సేటుయొక్క కఠిన వర్తనము వారించుటకు దేవరవారు సకల విధముల యత్నించిరని వింటిని. ఐన, నవియెల్ల విఫలమైనందున నేను నాచిత్త శాంతినిగోల్పోవక సకలకష్టముల ననుభవింప సంసిద్ధుఁడనై యున్నాఁడను.

రాయ : సేటును రమ్మనుఁడు.

శివ : మహాప్రభూ ! అతఁడు హజారమువద్ద సిద్ధముగ నున్నాఁడు.

[సేటు ప్రవేశము.]

రాయ : ఏమయ్యా ! సేట్ ! మా యెదుట నిలువుము. నీ వతికాఠిన్యము వహించినట్లు కన్పట్టుచున్నను, గార్యరంగమునఁ గడుదయార్ద్రహృదయుఁడవై మెలఁగెదవని తలఁచెదను. నీవు గొప్పమనసు చేసి సత్యమూర్తి శరీరమునుండి మాంస శకలము గైకొనకుండుటే గాక అతఁడీయవలసిన ఋణధనము లేశమైననుఁగోరక యిప్ప

డాతనికి దాపరించిన మితిలేని నష్ట కష్టములవలన వానిపైఁ గరుణ వహించి వానిని క్షమింతువని కోరెదను. నీవు క్రూరకార్యముల కొడిఁగట్టవని జను లాశించుచున్నవారు.

సేటు : దేవరా ! నేను నాయుద్దేశము నిదివఱకే తమ కెఱింగించియున్నాడను. నేను నా పత్రము ప్రకారము నాకుఁ జెందవలసిన యపరాధమును గైకొనకమాననని శపథమొనర్చి యున్నాడను. దేవర వారు న్యాయవిరుద్ధముగ వర్తింపరని నమ్మెదను. మూడువేల వరహాలు తీసికొనక ఒకసేరుమాంసముమాత్రమే నేను కోరుట వింతగాదు. వానిపై నాకుఁగల క్రోధము, నసూయలే యిందుకుఁ గారణము.

వసం : ఎంతటి క్రౌర్యము !

సేటు : నేను నీకు సమాధానమివ్వ నక్కరలేదు.

సత్య : వసంతా ! నీవు సేటుతో మాటాడఁదలఁచితివా ? వేమనవాక్యము జ్ఞప్తియున్నదా ?

గీ॥ " పరగరాతిగుండు పగులఁగొట్టఁగవచ్చు ;
కొండలన్ని పిండి గొట్టవచ్చు ;
కఠినచిత్తుమనసు గరగింపఁగారాదు ;
విశ్వదాభిరామ, వినురవేమ ॥ "

అతనికోర్కెమేరకు నే నీక్షణమే శిక్ష ననుభవించుటకు సంసిద్ధుఁడను.

వసం : నీ మూడువేల వరహాలకు, నారువే లివిగో ! తీసికొనుము.

సేటు : ఈ యారువేలకారింతలిచ్చినను, నే నొల్లను. నా పత్రమే నాకు శరణ్యము.

రాయ : దయాదాక్షిణ్యమెఱుంగని నీపై భగవానుఁ డనుగ్రహము నెఱపు టెటులో గదా !

సేటు : నేను కోరునది న్యాయసమ్మతము. కాన నాకు భయములేదు. వీని వల్ల నాకుఁజెందవలసినసేరుమాంస మమూల్యమైనది. కాన నేను దానిని వదలుకొనను. రాయలవారు తీర్పు నొసంగవేడెదను.

రాయ : సభాసదులారా! బలవంతరావను నొక ప్రఖ్యాతన్యాయవాది నిచ్చటికి రావించి, యీ విషయమును దీర్మానింపదలఁచి యున్నాడను. అతఁడు నేఁడు రానిచో, నేనీసభనింతటితో ముగించెదను.

శివ : మహాప్రభూ! పునహానగరమునుండి న్యాయవాది పంపినలేఖలఁ గైకొని ప్రతీహారియొకఁడిప్పుడేవచ్చి సభామంటపమువెలుపల వేచియున్నాడు.

రాయ : ఆ లేఖలఁగొనిరమ్మ. ప్రతీహారి నిచ్చటికిఁ బిలువుము.

వసం : సత్యమూర్తీ! సంతోషవార్త. నా కింకను ధైర్యమున్నది. నా మేన నస్థిరక్తమాంసాదులెల్ల నశించినఁగాని నా కొఱకై నీశరీరమును గష్టపడనివ్వను.

[నీలవేణి, న్యాయవాదిగుమాస్తావేషమునఁ బ్రవేశము.]

రాయ : నీవు పునహానుండి వచ్చితివా?

నీల : చిత్తము; దేవరకు బలవంతరావువిజ్ఞాపనములు.

(ఒకలేఖ నందిచ్చును).

వసం : సేట్జీ! కత్తి సానపెట్టుచున్నావా? అంతటి యాతురత యేల?

సేటు : ఆ నికృష్టుని మాంసఖండనమునకే!

కేశ : ఇంతమందిప్రార్థనాపూర్వకమగు కోర్కెను నీవు వినవా?

సేటు : నామనసు మార్చుటకు నీకలవిగాదు.

కేశ : ఛీ! కుక్కా! నీవు నరకమున కేగెదవు.

రాయ : బలవంతరావుగారొకసుప్రసిద్ధన్యాయవాదిని మనసభకిప్పుడు పంపిన ట్టుల వ్రాసినారు. ఆ యువకుఁడెక్కడ?

నీల : దేవరయాజ్ఞకొఱకెదురుచూచుచున్నారు.

రాయ : మీలోఁగొందఱువెళ్ళి, వారిని సగౌరవముగ నిచటికిఁ గొనిరండు. ఇంతలో బలవంతరావుగారిలేఖను జదివించెద, నాలకింపుఁడు.

(గుమాస్తా చదువును).

" శ్రీ శ్రీ శ్రీ రాయలవారికి నా విన్నపములు. తమయుత్తరము నాకందునప్పటికి నేను దేహారుగ్మతచే బాధపడుచుంటిని. కాని యాసమయమున యువకుఁడగు నొకన్యాయవాది విక్రమసింహపురినుండి నావద్ద కరుదెంచియుండెను. అతనిపేరు సుబ్రహ్మణ్యం. నేటునకును, సత్యమూర్తికినిగల వివాదవిషయ మాతనికిఁ దెలిపితిని. అంత, మే మిరువురముగలిసి న్యాయశాస్త్రగ్రంథములఁ గొన్నింటిని బరిశీలించితిమి. నాయభిప్రాయ మాతఁడెఱుంగును. ఇఁక వాని సొంతతెలివితేటలు వర్ణనాతీతములు. అతఁడు వయసునఁ జిన్నవాఁడయ్యును గడుంగడు గౌరవపాత్రుఁడు. జ్ఞానవృద్ధుఁడు. వేయేల ? అతఁడీవివాదమును బరిష్కరించునపుడు వానిమేధ మీకుఁ బ్రత్యక్షానుభవముకాఁగలదు.

రాయ : వింటిరిగదా బలవంతరావుసందేశము !

[ఇందిరాదేవి న్యాయవాది వేషమునఁ బ్రవేశించును.]

ఆర్యా ! స్వాగతము ! తమరాక శ్రీ బలవంతరావువద్దనుండియేగదా !

ఇంది : చిత్తము, మహాప్రభూ !

రాయ : మిక్కిలిసంతోషము. ఆసీనులరగుఁడు. ఇప్పుడీసభలో చర్చనీయ వివాదవిషయము తమకుఁ దెలియునుగదా !

ఇంది : పరిపూర్ణముగ నెఱుంగుదును. వీరిలో నేటు యెవరు ? సత్యమూర్తి యెవరు ?

రాయ : సత్యమూర్తీ ! నేట్జీ ! మీరు నిలువుఁడు.

ఇంది : నీవేనా మార్వాడీ నేటు ?

నేటు : అవును.

ఇంది : పత్రము వ్రాసి యిచ్చినది వాస్తవమేనా ?

నేటు : అవును.

ఇంది : ఐనను నేటు కరుణింపవలెను.

నేటు : ఆ విషయమై బలాత్కారమేల ?

ఇంది : సీ॥ శివునిజటాజూట శిఖరిపైనుదయించి
భువిని సస్యంబులఁ బ్రోదిసేయు ;
అప్సరోంభః క్రీడ కాలవాలంబయ్యు
పేదకు దాహమ్ము ప్రీతినొసఁగు ;
ఘనఘనాఘనలక్ష్మి గారాబుపట్టియై
లవణాబ్ధితరఁగల లయమునొందు ;
పట్టభద్రునిఁజేయఁ బ్రాణంబుహరియింపఁ
గారణంబై నట్టిగంగనొసఁగు ;
గీ॥ నట్టిమందాకినింబోలె నాప్తమైన
దివ్యకరుణను స్తుతియింప దేవువశమె ?
కరుణదేవతదీవించుఁ గరముద్వయము
దానశీలప్రతిగ్రహధర్మపరుల ॥

శ్రీ భగవానుఁడనుగ్రహించుగాఁతమని మనమెల్లప్పుడు ప్రార్థింతుముగదా ! అదేప్రకారము, మనమొనరించుకార్యములందును గరుణరసము చిప్పిలుచుండవలెను. నాయీపల్కులవిన్నమీదటఁ గూడ నీవు న్యాయమాత్రమునే కోరుదువేని, శ్రీ రాయలవారు సత్యమూర్తికి శిక్ష విధింపవలయును.

నేటు : నా పుణ్యపాపములు నావి. చట్టప్రకారము పత్రముషరతు యథావిధిగా జరుగవలెను.

ఇంది : సరి ; ఆ ఋణముమొత్తము చెల్లించుట కాతనికి శక్తిలేదా ?

వసం : ఇదిగో ధనము. అసలుకు రెండింతలు, కాదేనిఁ బదింతలైనఁ జెల్లింప సంసిద్ధుఁడను. అందుకాతఁడొప్పనిచో వానిద్వేషభావమే వెల్లడియగును.

ఇంది : ఐనను శాసనధిక్కారమున కెవ్వరికి నధికారములేదు.

నేటు : న్యాయమూర్తీ ! ధర్మాత్మా ! ఆహా ! ధర్మాత్ముఁడేసుమా ! ఈ న్యాయవాది వివేకము నేమని పొగడుదును !

ఇంది : ఏదీ నీ పత్రమిటు తెమ్ము.

నేటు : చిత్తము. చిత్తగింపుడు. (అందిచ్చును).

ఇంది : నీ అసలుకు మూడురెట్లుధనమిచ్చెదమనుచున్నారు. పత్రములోని గడువు మీరినందున న్యాయప్రకారము సత్యమూర్తిగుండెకుదాపున నొకసేరు మాంసము కోసికొనుటకు నీకధికారముకలదు. కాని కొంచెముకనికరించి మూడింతలుధనము తీసికొని తృప్తిపడుము.

సేటు : సేరుమాంసమే నాకుఁగావలెను. షరతుప్రకారము తాము తీర్పు నొసంగఁడు, న్యాయచట్టమును గరతలామలక మొనర్చికొన్న న్యాయవాదులు తాము న్యాయానుసారము తీర్పుచెప్పవలెను. ఎవ రేమిచెప్పినను నామనసు మారదు.

సత్య : దేవరవారు తీర్పుచెప్పెదరుగాకయని ప్రార్థించెద.

ఇంది : ఇంకఁ దీర్పు దెలిసినవిషయమే. వానికత్తిపోటునకు నీవు నీ ఱొమ్మును సిద్ధపఱపుము.

సేటు : ఈన్యాయవాదిప్రాశస్త్యమేమి! యువకుఁడయ్యును గొప్పబుద్ధిశాలి!

ఇంది : పత్రములోవిధించినప్రకారము జరుగవచ్చును.

సేటు : కడుంగడు సత్యము. వీరు న్యాయవాదియే సుమా!

ఇంది : నీ గుండెను జూపెట్టుము.

సేటు : అవును! "గుండెసమీపమున" అని పత్రములోనున్నది.

ఇంది : సరే! ఆ మాంసమును దూచుటకుఁ ద్రాసు కలదా?

సేటు : నేను సిద్ధపఱచితిని.

ఇంది : సేట్‌జీ! అతఁడు మరణింపకుండుటకై వానిరణము మాన్పించుటకు నీవొకశస్త్రవైద్యుని బిలిపింపుము.

సేటు : ఆవిషయము పత్రములో నున్నదా?

ఇంది : అది ప్రత్యేకముగఁ జెప్పనక్కఱలేదు. అంతమట్టుకు నీవు కరుణింపవచ్చును.

సేటు : పత్రములోలేనిది నాకేల?

ఇంది : సత్యమూర్తీ! నీవేమైనఁ జెప్పఁదలఁచెదవా?

సత్య : లేదు. నేను సంసిద్ధుఁడను. వసంతా! సుఖింపుము. నీకొఱకై నేనీ స్థితికివచ్చితినని దుఃఖింపకుము. వార్ధక్యమున నన్ను దారిద్ర్యము నుండి తప్పించుటకు విధి ప్రేరేపించుచున్నది. నీప్రేయసికి నా

యభివాదములు తెలుపుము. నా యంత్యకాలవిధమును, నాకు నీమీదఁగలప్రేమను, నీ వామెకుఁ దెల్పుము. నేటుచేతికత్తి పోటు కొంచెము లోతుగఁ బ్రాకినచో, నేను నా హృదయపూర్వకముగ ఋణవిముక్తిఁ బడయుదును.

వసం : సత్యమూర్తీ! నా ప్రేయసి నాకుఁ బ్రాణసమానయైనను, నా ప్రాణము, నా ప్రాణేశ్వరి-వేయేల, యీ ప్రపంచమంతయుఁగూడ నాభావనలో నీ ప్రాణముకన్న నెక్కువకాఁజాలవు. ఈ దయ్యపు బారినుండి నిన్ను రక్షించుటకు నేను నాసర్వస్వము ధారవోయుదును; సర్వము పరిత్యజించెదను.

ఇంది : నీవాడిన యీమాటలు నీభార్య విన్నచో నిన్ను మన్నింపదు.

కేశ : నాప్రేయసి స్వర్గముచేరియైనను స్వర్గాధిపుబలిమిచేనైన నీనికృష్టుని బుద్ధి మరల్పఁజాలునా?

నీల : నీయాలిచ్చటలేదుగదాయని వదరుచున్నావు. ఉన్నచో, నీ యీ మాటలింటిపోరునకుఁ గారణమగును.

నేటు : (స్వగతము). వీరు రసపుత్రులఁట. నా కూఁతురికి భర్తకాఁగల వాఁడు కటికవాఁడైనను వీరికంటెమేలే? (గట్టిగా) కాలయాపన మేల? దయచేసి తీర్పునొసఁగుఁడు.

ఇంది : సత్యమూర్తిదేహమునుండి యొకనేరు మాంసమును న్యాయచట్ట ప్రకారము నీకు రాయలొసంగఁగలరు.

నేటు : సత్యప్రభూ!

ఇంది : ఆమాంసమును నీవు వానిరొమ్మునఁ గోసికొనవలెను.

నేటు : ఆహా న్యాయమగుతీర్పు! న్యాయాధిపతినేర్పు! సత్యమూర్తీ! శిక్షయైనది. రమ్ము; సిద్ధపడుము.

ఇంది : నేట్జీ! కొంచె మాగుము. ఇంకొక విషయమున్నది. ఈ పత్రము ప్రకార మొక్కబొట్టునెత్తురునకుఁగూడ నీకధికారములేదు. అందుఁ జెప్పఁబడినదొక నేరుమాంసముమాత్రమే. దీనిప్రకారమొకనేరు మాంసము నీవు తీసికొనుము. కాని, దానిని ఖండించుటలో రసపుత్రరక్తమొక్కకణమైనఁ గ్రిందపడినచో, యీ విజయనగర రాజ్యశాసనానుసారము నీయాస్తియెల్ల ప్రభుత్వవశమగును.

కేశ : సత్యప్రభూ ! కౌశల్యనిధీ !

సేటు : న్యాయచట్టమటులున్నదా ?

ఇంది : శాస్త్రము నీవే పరికింపుము. నీవు న్యాయముకోరితివిగాన నీ కోర్కెకుమించినన్యాయమును బొందెదవు.

కేశ : న్యాయాధిపతినేర్పు చూడు !

సేటు : అటులైనచో ఋణమునకుమూడింతలుధనమిండు. వీనిని వదలి వేసెదను.

వసం : ఇదిగో ధనము.

ఇంది : నిలు నిలు ; ఆతనికి పరిపూర్ణన్యాయము కలుగవలెను. కొంచె మాగుము. త్వరపడవద్దు. సేటుకు సేరుమాంసమే చెందవలెను. నెత్తురుచుక్క రాలఁగూడదు. మఱి యెచ్చుతగ్గులులేక సరిగా నొక సేరుమాంసముమాత్రమే ఖండింపవలెను. అణుమాత్రము భేదము న్నను సేటుప్రాణము దక్కదుగదా! వానియాస్తియంతయుఁ బ్రభుత్వ వశమగును.

కేశ : ధర్మదేవత యవతరించినదా ? సేట్, నీవిప్పుడు చిక్కితివిలే.

ఇంది : ఏమయ్యా ! జాగేల ?

సేటు : నాయసలుధనమిచ్చినచో, నేను వెళ్ళెదను.

వసం : ఇదిగో డబ్బు సిద్ధముగా నున్నది.

ఇంది : ధనము వద్దని యతఁడు రాయలతోఁ జెప్పియున్నాఁడు.

సేటు : నా యసలుకూడ నాకు లభించదా ?

ఇంది : అపరాధముతప్ప మఱేమియు నీకు దక్కదు. ఇఁక నీయిష్టము.

సేటు : అటైనచో, నేనీవిషయ మింక వాదింపను.

ఇంది : ఆగుమాగుము ! విజయనగరచట్టప్రకారమొకరాజపుత్రునికిఁ బ్రాణా పాయము గావింపఁదలఁచినవానిసొత్తులోసగమారసపుత్రునికిని, దక్కినసగము ప్రభుత్వమునకును జెందవలెను. నీ ప్రాణము మాత్రముకరుణింప రాయలవారర్హులు. నీ విప్పుడట్టిపరిస్థితిలో

నున్నావు. నీవు సత్యమూర్తి ప్రాణమపహరింపఁదలఁచితివనుట వాస్తవము. కాన నీవీవిపత్తునుండితొలంగుటకై రాయల వారికాళ్లకు మ్రొక్కి కనికరింపవేడికొనుము.

రాయ : నీకునుమాకునుగలతారతమ్యము దెలుపుటకై మేము నీకు ప్రాణదాన మొసంగుచున్నాము. నీయాస్తిలోసగము సత్యమూర్తికిఁజెందును. నీవు క్షమాపణవేడినచో, జరిమానావిధించి నిన్ను క్షమింతుము.

సేటు : నా జీవము, నా సర్వస్వము మీరు తీసికొనుఁడు, నన్ను క్షమింపవలదు.

ఇంది : సత్యమూర్తీ ! వానిపై నీవు కారుణ్యము వహింతువా ?

కేశవ : హా ! దైవమా ! వాఁడు కరుణకుఁ బాత్రుఁడా ?

సత్య : నాకుఁజెందదగినవానిసగమాస్తిని, వానిజీవితానంతరము వానియల్లు నకును, గొమార్తెకు నొసంగుచున్నాను. ఇఁక నతఁడు తన మరణా నంతరము తనయాస్తినంతనుఁదనకొమార్తెకు నల్లునకును జెందు నట్లు వ్రాతమూలకముగ దృఢపఱచవలెను.

రాయ : అతఁడట్లేచేయవలెనని మాయాజ్ఞ.

ఇంది : ఏమయ్యా, తృప్తియేనా ? ఏమనెదవు ?

సేటు : సంతృప్తి. (నిష్క్రమించును).

రాయ : (ఇందిరతో) ఆర్యా, తాము మాయాతిథ్యము గైకొనవలె.

ఇంది : రాయలవారు నన్ను మన్నింపవలెను. నేనీరాత్రి పునహానగర మునకు వెళ్ళవలెను. కాన నే నీక్షణమే ప్రయాణమయ్యెదను.

రాయ : మీకుతడవులేనందుకు నేను మిక్కిలిచింతించుచున్నాను. సత్యమూర్తీ వీరిని సత్కరింపుఁడు. వీరు నీకు మహోపకారులు. ప్రాణదాతలు. (రాయలు సపరివారముగ నిష్క్రమించును).

వసం : మహాశయా! తాము నేఁడు తమబుద్ధికుశలతచే నాకును నాస్నేహితు నకును గలుగనున్న గొప్ప దుర్దశను దొలఁగించితిరి. మాకృతజ్ఞతా సూచకముగ మేము మూడువేలవరహాలను దమకుఁబ్రీతిపూర్వక బహూకరణ మొసఁగెదము.

సత్య : అంతేకాదు. మేము మీదాసులమై యెల్లపుడు మెలఁగెదము.

ఇంది : నేను మిమ్ములనురక్షింపఁగల్గుటచే నాకొదవినసంతోషమే నాకుఁదగిన బహూమానము. మనము మరలకలిసికొన్నపుడు నన్ను గుర్తింపుఁడు, మీకు సుఖమగుఁగాక. నాకిఁక గాలహరణమగును, సెలవు,

వసం : ఆర్యపుత్రా! మాజ్ఞాపకార్థము మావద్ద మీరేదేని గ్రహింపక తప్పదు.

ఇంది ; ఇంతగా నొక్కిచెప్పితిరిగాన మీవ్రేలియుంగరము నివ్వండి! ఓహో! చేతిని వెనుకకుఁ దీసికొనుచున్నారే? నాకు వేఱేమియు నక్కఱలేదు. మీకు నాపయిఁ బ్రీతియున్నచో నాకు దానినివ్వక తప్పదు.

వసం : అటుచేసినచో నా కవమానమగును! నే నేమందును ?

ఇంది : అదితప్ప యింకొకటి నే నొల్లను. నా మనసు దానిపై లగ్నమైనది.

వసం : అమూల్యమని కాదు. అంతకన్న ఘనమైన దాని నరసితెచ్చి తమకిచ్చెద.

ఇంది : అయ్యా! మీకు మాటలలోగలధాటి చేతలలోలేదు. తొలుతఁగోరి కొనుమనిచెప్పి, పిమ్మట యీమాటలేల ?

వసం : స్వామీ! ఇది నాప్రేయసి నాకొసఁగినప్రణయాంగుళీయకము. నే నెప్పుడు దీనిని బాసియుండరాదు.

ఇంది : ఈసాకులు నాకుఁదెలియును. నాయర్హతనెఱిఁగినచో నీభార్య నీవీ యుంగరమును బాసినందులకు నిన్ను దూషించునంతటి యవివేకురాలుగాదు. సరే. సుఖింపుఁడు.

(ఇందిర, నీలవేణి నిష్క్రమింతురు).

సత్య : ప్రియవసంతా! వానియర్హతను, నాచెలిమిని గూర్చియైన, నీవు నీ భార్యమాటజవదాటి, నీయుంగరము నతనికిమ్ము.

వసం : కేశవా! నీవువెళ్ళి వారిని గలిసికొని, యీయుంగరము నతనికిచ్చిరమ్ము. జాగుసేయకు.

(కేశవరావు నిష్క్రమించును).

# ఇందిరా వసంతము

~~~○~~~

## చతుర్థాంకము — ద్వితీయరంగము

~~~○~~~

విజయనగరములో నొకవీధి

[ఇందిర, నీలవేణి పురుషవేషమునఁ బ్రవేశింతురు]

ఇంది : సేటు మేడకువెళ్ళి వానిచేత నీవీపత్రములో సంతకముచేయించి తీసికొనిరమ్ము. మనమీరాత్రికే వెళ్ళుదము. మనప్రియులు మరలి వచ్చుటకుముందే మనమిల్లుచేరవలెను. ఈపత్రము సుందరేశునికి సంతసకరమగును. (కేశవరావు ప్రవేశము).

కేశవ : ఆర్యా! నేను మీపదుగందుకొనఁగల్గుట నాభాగ్యము. మావసంతయ్యగారు కొంచెమాలోచించినమీదట తనయుంగరమును మీకిచ్చిరమ్మనిపంపినారు. అంతేకాదు. మిమ్ములను విందునకాహ్వానించుచున్నారు.

ఇంది : భోజనము వలనుపడదు. వానియుంగరమును మిక్కిలికృతజ్ఞతతోఁ బుచ్చుకొనుచున్నాను. ఈ సంగతి నీవు తెల్పుము. మా గుమాస్తాకు సేటుమేడను జూపెదవా?

కేశవ : ఆహా! అట్లే చేసెదను.

నీల : (ఇందిరతో) ఒక్కమాట. నేనును నాభర్తవద్దనుండి నేనాతనికిచ్చియుండినముద్దుటుంగరమునుదీసికొనయత్నించెదను.

ఇంది : (నీలవేణితో) కానిమ్ము, నాకిష్టమే. వారిరువురిచే మనయుంగరములను బురుషులకేయిచ్చితిమని ప్రమాణముచేయించి యటులెన్నటికిని జరిగియుండదని మనము ప్రతిగాఁ బ్రమాణముచేసి వారిని సిగ్గుపఱచెదము. (ప్రకాశముగా) జాగుసేయక శీఘ్రమే వెళ్ళుము. నేను నీకొఱకెచ్చట వేచియుందునో తెలియునుగదా!

నీల : రావయ్యా! సేటుయిల్లు నాకుఁజూపెట్టు.

(అందరు నిష్క్రమింతురు).

# ఇందిరా వసంతము

## పంచమాంకము — ప్రథమరంగము

గోలకొండ : ఇందిరమేడప్రక్కనొక యుద్యానవనము

[సుందరేశం, చంద్రరేఖ ప్రవేశము]

సుంద : ఉ॥ చందురుఁడొప్పఁబూర్ణకళఁ జంద్రికవెల్లువలుల్లసిల్లఁగా ।
మందమరుత్కిశోరమతిమాధురిధుర్యము వన్నెగూర్పగాఁ ।
గ్రందుగఁగమ్మతావులను రమ్యమొనర్పఁబ్రసూన సంపదల్ ।
సుందరమైనయీవనముశోభనుజూచితెజీవితేశ్వరీ ॥

సీ॥ ఏనిండునెలరేయి నింద్రుండహల్యతో
భోగించుకోర్కెమైయేగెనొక్క

చంద్ర : ఏ పూర్ణిమారాత్రి యిందుపొందును గోరి
యుపవనంబునఁదారయుండెనొక్క

సుంద : ఏనెలనడిమిరేఁగానఁబురూరవుఁ
బాసియూర్వశిలతాప్రాయమయ్యె

చంద్ర : ఏనిరతజోత్స్నమేనుక్రాగవిరాళి
నుషఁగూర్చియనిరుద్ధుఁడుమ్మలించె

సుంద : అట్టి వెన్నెల వలపుమైయడుగులిడెను
చంద్రరేఖయు గోల్కొండజాడపట్టి

చంద్ర : అట్టిచంద్రికఁ బ్రణయంపువట్టిప్రతిన
సొంపుచేఁ బ్రియహరియించె సుందరేశుఁ

సుంద : దట్టి జ్యోత్స్నోత్సవంబున నతివదూరఁ
జంద్రరేఖాప్రియుండును జాలవలచె ॥

చంద్ర : ఈ రాత్రియంతయు నింకెవ్వరును రాకున్నచో నేను నీకు బదులు చెప్పఁగలను. కాని, అదిగో, ఆలకింపుఁడుఎవరోవచ్చుచున్నపాద ధ్వని విననగును. (సుబ్బఁడు ప్రవేశము)

సుంద : ఎవరాచీకటిలో నిశ్శబ్దముగా వచ్చునది ?

సుబ్బ : చెలికాఁడు.

సుంద : చెలికాఁడు ? ఎవరాచెలికాఁడు ? నీపేరేమి ?

సుబ్బ : నా పేరు సుబ్బన్న. మాదేవిగారు ప్రొద్దుపొడువకముందే యిచ్చటికి వచ్చెదరని మీతోఁజెప్పవచ్చితిని.

సుంద : ఆమెతోఁగూడ యింకెవరు వచ్చెదరు ?

సుబ్బ : చెలికత్తెమాత్రమే. మాపంతులుగారింకను రాలేదా ?

సుంద : వారిసంగతి తెలియలేదు. కాని చంద్రరేఖా ! మనము లోనికరిగి దేవిగారిస్వాగతమునకు సిద్ధముచేసెదము. (బసవయ్య ప్రవేశము).

బస : అయ్యా, అయ్యా, నిలవండయ్యా !

సుంద : ఎవరాపిలిచేది ?

బస : అయ్యా, సుందరేశయ్యను వారిభార్యను జూచినారా? చెప్పండయ్యా?

సుంద : ఓయ్ ! నీ గోలనిలుపు. ఇక్కడ రా.

బస : అయ్యా ! ఎక్కడ, ఎక్కడ ?

సుంద : ఇదిగో ఇక్కడ రా.

బస : మా పంతులుగారు తూరుపుతెల్లవారకముందే యిచ్చటికి వస్తారని వార్తవచ్చింది. ఆమాట సుందరేశంతో చెప్పండి.

(నిష్క్రమించును)

సుంద : ప్రేయసీ ! లోనికివెళ్ళి వారిరాక నిరీక్షింతము-వచ్చిన మాత్రమేమి? మనము మేడలోనికేల పోవలెను ? ఓరే ! సుబ్బన్న ! నీవు లోనికి వెళ్ళి దేవిగారువచ్చుచున్నారనిచెప్పి గాయకులను బిలిచికొని రమ్మ. (సుబ్బఁడు నిష్క్రమించును)

చ॥ అసదృశకౌముదీరుచిరహాసవికాసముఖావతంసినై
ప్రసవతతిప్రకాశప్రతిభాపరిపోషితభూషితాంగినై
అసమసువర్ణపూతయగునాకసలచ్చియనుంగుతోడుగాఁ
బసగలయామినీరమణిభాసిలుటంగను సంతసంబునన్ ॥

(గాయకులు ప్రవేశింతురు).

ఓహో! రండు! ఒకశ్లోకముచదివి సరస్వతీప్రార్థనమొనర్పుఁడు. పిదప మీగానమాధురి కర్ణపేయముగా నీమేడకు దేవిగారు వచ్చెదరు. (సంగీతము వినఁబడును).

చంద్ర : అదేమోకాని సంగీతశ్రవణమువలన నాకు సంతోషములేదు.

సుంద : అందులకుఁ గారణమేమన, నీవెల్లప్పుడు నాలోచనానిమగ్నురాలవై యుండుటయే.

శా॥ ఆబృందావని గానలోలుఁడు విహారాహ్లాదిగాఁగృష్ణుఁడున్
గోబృందంబులు మేతమాని కొలిచెన్, గోపాలగోపీజనుల్
వేబృందారకముఖ్యవేణురవమున్ వేడ్కన్ వినెన్ ; భూమిభృ
త్తుల్ బృందంబులు జీర్ణవృక్షములు ప్రాప్తుల్గావె చైతన్యతన్॥

(ఇందిర, నీలమణి ప్రవేశింతురు).

ఇంది : మనకగపడుచున్నయాదీపము, నాగదిలో వెలుగుచున్నది. ఆ దీపపుకాంతి యెంతదూరమావరించినది! ఈ దుష్టప్రపంచమున నొక్కసత్కార్యము నటులే ప్రకాశమానమగును.

నీల : చందమామవెన్నెలలో మనకాదివ్వె కనిపించలేదే!

ఇంది : అవును,

గీ॥ అధికతరకీర్తిస్వల్పమ్మునధిగమించు
జీవనదిలోన నెలయేఱు చేరుఁగాదె!
చక్రవర్తిప్రతాపుండు చెఱను వీడు
వఱకు పేరయ్యరాజ్యమ్ము వఱలలేదె!

అదె! సంగీతము వినఁబడుచున్నది ఆలకింపుము!

నీల : దేవీ! అది తమ మేడలోనిదే.

ఇంది : పగటికన్నను నిశీథమున గానరసము మధురతరముగానున్నది. సద్దు. ఆహో! చంద్రుఁడు రోహిణీసమేతుఁడై నిద్రించుచున్నాడు. చప్పుడుసేయకుము. (సంగీత మాగిపోవును).

సుంద : అది యిందిరాదేవికంఠస్వరముగానున్నదే.

ఇంది : గ్రుడ్డివాఁడు కోకిలను దెలిసికొన్నట్లు వీఁడు నా కంఠమునుబట్టి న్నను గుర్తించినాడు.

సుంద : దేవీ ! స్వాగతము !

ఇంది : మేము మా ప్రాణేశ్వరులకుశలమునకై ప్రార్థించుచుంటిమి. వారు తిరిగివచ్చిరా ?

సుంద : అమ్మా, యింకనురాలేదు. కాని యింతకుముందొకవార్తాహరుఁడు వచ్చి వారు వచ్చుచున్నారని తెలిపివెళ్ళినాడు.

ఇంది : నీలా ! లోనికివెళ్ళి సేవకులకు నాయాజ్ఞగాఁ దెలుపవలసినదేమన మనమిల్లువిడిచివెళ్ళినసంగతి వారు తెలియనట్లుండవలెను. సుంద రేశం, చంద్రరేఖా ! మీరుకూడ నట్లే చేయవలెను.

(ఢంకాశబ్దము విననగును).

సుంద : మీ ప్రియుఁడరుదెంచుచున్నాడు. అమ్మా ! మేము చాడీలుచెప్పు వారముకాము. తాము మమ్మ్మ సందేహింపవలదు. భయములేదు. మాకు సెలవు. (సుందరేశం, చంద్రరేఖల నిష్క్రమణ).

ఇంది : ఈరాత్రి సూర్యరశ్మిలేనిపగటికన్న మిక్కిలిశోభావిహీనమైయున్నది.

[వసంతుఁడు, సత్యమూర్తి, కేశవరావు సపరివారము ప్రవేశము]

వసం : సూర్యుఁడులేనిపగటికొఱకుఁబశ్చిమార్థభూగోళమునకు నీవీచీఁక టిలో నడచిపోఁగలవా ?

ఇంది : నా సహజదీప్తితోనేనీయంధకారమును బటాపంచలొనర్చెదను. కాని వట్టి తళుకుబెళుకులతోఁగులుకు కులుకుమిటారిభార్య భర్తకు దుఃఖ కారణమగును. నే నటులొనర్పరాదు. ప్రాణేశ్వరా ! తిరిగి మీ రింటికి సురక్షితముగ వచ్చినందులకు సంతోషము.

వసం : ప్రేయసీ ! కృతజ్ఞుఁడను. స్నేహబద్ధానురాగుఁడైననాప్రియమిత్రుఁడు సత్యమూర్తి యీతఁడే ! వీరికి స్వాగత మొసంగుము.

ఇంది : నీకొఱకాతఁడు చట్టబద్ధుఁడై బంధీకృతుఁడై యుండెనని వింటిని. కాన నీవాతనియెడఁ బ్రేమానురాగపాశబద్ధుఁడవై యుండవలెను.

సత్య : ధన్యోస్మి !

ఇంది : ఆర్యా ! మీరు మాయింటికతిథులగుట మాకెంతోసంతోషకరము. మా యాతిథ్యము వట్టిమాటలతోఁగాక కార్యరూపము దాల్చవలెను.

కేశవ : (నీలవేణితో) ఆ చంద్రుఁడుసాక్షిగా నామాటనమ్ముఁడు, పొర పడవద్దు. దానికై నీవింత చింతించుటఁజూడ, వాఁడు చచ్చుఁగాక యని నేను మనసారఁగోరుచున్నాడను.

ఇంది : ఇంతలోనే జగడమెందులకు ? ఏమి సంగతి ?

కేశవ : ఆమె నాకిచ్చిన యాచిన్నబంగారపుటుంగరమునుగూర్చి దానిపైన "నన్ను ప్రేమింపుము, నన్ను విడువకుము." అని వ్రాసియుండెను.

నీల : ఓహో ! అది నీకంత స్వల్పవస్తువుగాఁ దోచినదా ? నేను దానిని నీ కిచ్చినపుడు నీవేమంటివి ? దానిని నీవు నీమరణపర్యంతము పాయననియు, నీవు చచ్చినపిదపఁగూడ దానిని నీశవముతోఁగూడ దహనముచేయుమనియు నీవు నాతో నొట్టుపెట్టుకొని చెప్పలేదా ? నాకొఱకుగాకున్న నీమాటనిలుపుకొనుటకైన, నీవు దానిని విడ నాడియుండరాదు. న్యాయవాది గుమాస్తాకిచ్చితివా ? ఆ గుమాస్తా మీసములేని పురుషుఁడై యుండవలెను. దేవుఁడే నాకిఁక దిక్కు.

కేశవ : ఈచేతితోనేనాయుంగరమునొసఁగిన యాయువకుఁడు నీపొడుగు పాటి పసివాఁడు. ధనమిచ్చెదనన్నను నామాటవినక వాఁడా యుం గరమునేకోరినందున, నేను బదులుచెప్పుటకు నాకు నోరురాలేదు.

ఇంది : నీభార్య నీకొసఁగిన తొలికానుకను నీవితరుల కిచ్చివేయుట గొప్ప తప్పిదము. ప్రమాణముచేసి వ్రేలనుంచుకొన్న యుంగరమును నీ విచ్చివేయుట తగనిపని. నా ప్రియునికిని నేనొక యంగుళీయక మొసఁగితిని. అతఁడు దాని నెప్పుడు విడనాడనని వాగ్దాన మొనర్చెను. ప్రపంచములోని ధనమెల్ల యిచ్చినను దానిని వారు విడిచిపెట్టరని నా నమ్మకము. కేశవా ! నీవు చేసినపని నీ భార్యకు నిజముగ దుఃఖకారణము. నాకే అట్టి యపకృతిజరిగినచో నాకుఁ బిచ్చిపట్టియుండును.

వసం : (స్వగతము) నే నేమిచేయుదును ? నా యెడమచేతిని దెగ(వేసి కొందునా ? ఆ చేతికొఱకై పోట్లాటలో నుంగరము పోగొట్టుకొంటి నని బొంకనా ?

కేశవ : మాపంతులుగారు తమచేతియుంగరమును న్యాయవాదికొసంగిరి. అటుపిమ్మటనే, గుమస్తా నాయుంగరమును దనకిమ్మని కోరెను. వారిరువురు మాయుంగరములం దప్ప వేఱేమియుఁ గైకొనరైరి.

ఇంది : నాథా ! మీ రేయుంగరము నిచ్చితిరి ? నే నిచ్చినదికాదుగదా !

వసం : చేసిన తప్పునకుఁ దోడుగ నబద్ధముకూడనా ? నా(వేల నీ యుంగర మున్నదో లేదో నీవే చూడుము.

ఇంది : ఆహా ! మీరు సత్యదూరులు. నాకు మీ రాయుంగరమును జూపువఱకు నేను మీ పొందుగోరనని శపథము చేయుచున్నాను.

నీల : నేను నట్లే చేసెదను.

వసం : (షట్పది).

మ॥ చెలియా ! యెవ్వనికేనొసంగితినొ నాసిద్ధాంగుళీయమ్ము క్రొం
గలికే ! యెవ్వనిస్నేహభావకలనన్ గైకొన్కనన్ భాసెనో !
తెలియన్నేర్చితివేనినీవు, మఱి, యింతీ, యేలొకోనాకరాం
గుళిఁబాయంగ సహించి, వాఁడు పెఱుఁగైకోనంచుఁ జెప్పన్ మదిన్
దలఁగన్ లేకయ ధారవోసితివొ, నేఁద్వత్ప్రేమచిహ్నంబునున్
దలఁపన్నేర్చితివేని నీవిఁకనమున్ దథ్యంబ భూషింపవా !

ఇంది : అంగుళీయకమహిమ నెఱింగితేని
అంగుళీయకమును నీకొసంగినట్టి
అంగనాప్రతిభార్థమెఱింగితేని
అంగుళిందాల్చుగౌరవమరసితేని
అంగుళీయకమును నీవొసంగఁగలవె ?

ఉంగరమునివ్వఁగూడనికారణమును వాస్తవముగ నీవు తెల్పి యుండినచో నెంతటిమూర్ఖుఁడైన నంతపవిత్రమైనవస్తువు నాసిం

చునా ? నీలవేణిచెప్పినదే నిజము. ఉంగరమును నీవొకకులుకు లాడికిచ్చియుందువని నేను నమ్మకతప్పదు.

వసం : ప్రేయసీ ! ముమ్మాటికినిగాదు. దైవసాక్షిగ నేను దాని నేవనితకు నివ్వలేదు. మూడువేలవరహాల నిచ్చెదనన్నను, త్రోసిపుచ్చి, యా న్యాయవాది యీయుంగరమునే యిమ్మనిప్రార్థించెను. నే నివ్వ నంటిని. నాప్రియస్నేహితునిప్రాణముకాపాడినవాని మాటను సైతము నేను త్రోసిపుచ్చితిని. ప్రాణేశ్వరీ ! నేనేమందును ? అతఁడు వెళ్ళినపిమ్మట వానివెంటనేనాయుంగరమును బంపవలసివచ్చెను. నాకు సిగ్గుచేటయ్యెను. నేనుకృతఘ్నతకొడిగట్టఁ జాలనైతిని. దేవీ! నన్ను క్షమింపుము. ఈదివ్వెసాక్షిగ నేను జెప్పెదను. ఆసమయ మున నీవచ్చుటనుండినచో నీవే నన్ను బ్రతిమాలి యుంగరమును న్యాయవాదికిప్పించియుందువు.

ఇంది : అన్యాయవాదిని నాయింటివైపు రానియ్యకుము. కానిచో, నేను, ప్రేమించి, నా యుంగరమును గైకొన్నవానికి నేనుకూడ నాసర్వ స్వము ధారవోయుదునేమో !

నీల : (కేశవరావుతో) నేను నటులేగదా ! కనుక నీవును జాగరూకుఁడ వగుము.

సత్య : ఈ మీజగడములకు నేనేగదా కారణభూతుఁడను.

ఇంది : ఆర్యా ! మీరు చింతింపకుఁడు. ఏమైనను మీరు మాస్వాగతమున కర్హులు.

వసం : ఇందిరా ! నేనొనర్చిన యీ మహాపరాధమునకు నన్ను నీవు క్షమిం పుము. ఈ స్నేహితులందఱు వినుచుండ నా ప్రతిబింబమే కానవచ్చు చున్న నీనేత్రద్వయముసాక్షిగనేనిదేశపథముచేయుచున్నాను.

ఇంది : అదిగో చూడుము — నీ ప్రతిబింబద్వయముపైనొట్టు పెట్టుకొను చున్నావుగదా !

వసం : కాదు, నామాటవినుము. ఈతప్పుక్షమింపుము. నాయాత్మశుద్ధిగఁ బ్రమాణమొనర్చెదను. ఇంకెప్పుడును నేను నీతోనాడినమాటనుల్లంఘింపను.

సత్య : నేనొకసారి నాదేహమును వానిధనమునకుగా నొడ్డితిని. నీ యుంగరమునుగైకొన్నవానిసాయములేకున్నచో నాదేహమునశించియుండును. ఈమాఱువానిప్రతిజ్ఞాపాలనమునకై నేను నాసర్వస్వమునొడ్డుచున్నాను.

ఇంది : సరినీవు వానికిఁ బూచీపడుచున్నావు. దీనిని వానికిచ్చి, పోఁగొట్టిన దానికన్న నెక్కుడుజాగ్రత్తతో దీనినుంచుకొనుమనిచెప్పుడు.

సత్య : వసంతా ! ఇటురా. ఇదిగో, యీయుంగరమును విధనాడనని ప్రమాణముచేయుము.

వసం : దైవసాక్షిగా నేను న్యాయవాదికిచ్చినదీయుంగరమే !

ఇంది : నేను దీనిని వానినుండి గ్రహించితినివసంతా ! నన్ను క్షమింపుము.

నీల : కేశవా ! నీవు నన్ను క్షమింపవలెను. దీనిని నేను న్యాయవాదిగుమాస్తావద్ద తెచ్చితిని.

ఇంది : ఇతంతయు మీకుఁజిత్రవిచిత్రముగఁదోచుచున్నది. ఇదిగో, యీయుత్తరమును సావకాశముగఁజదువుఁడు. పునహానగరములోని బలవంతరావు వ్రాసియున్నాఁడు. దానివలన మీకుఁదెలియునదేమన, నిందిరన్యాయవాదియనియు, నీలవేణి న్యాయవాదిగుమాస్తయనియు మీరువెళ్ళినవెంటనే నేనిల్లువిడిచివెళ్ళి మరలయిప్పుడే వచ్చితిననుటకు సుందరేశంసాక్షి. నేనింకనింటిలోనికిఁగూడ వెళ్ళలేదు. సత్యమూర్తీ ! మీరాక మాకుఁజాలసంతోషకరము. మీరనుకొన్నంతకన్న నెక్కుడుశుభావహమైనవార్త యీ లేఖయందున్నది. దానిని విప్పిచదువుకొనుఁడు. మీ వ్యాపారపునావలుమూడు సరకులతోఁగూడ సురక్షితముగ రేవుచేరినవఁట. ఈ లేఖయెవ్విధమున నాచేతఁబడెనో నీకుఁదెలియదు.

8

సత్య : నాకు నోరాడకున్నది.

వసం : నీవు న్యాయవాదిగానుండిన, నేను నిన్నుగుర్తింపనైతినా ?

కేశవ : ఆగుమాస్తా నీవేనా ? (నీలతో)

వసం : అమ్మా ! నీవు నాప్రాణదాతవుమాత్రమేకాదు. నాజీవనాధారప్రదాతవుకూడ. నాయోడలు సురక్షితముగఁజేరినటులీలేఖయందున్నది.

ఇంది : సుందరేశం ! నాగుమాస్తా నీకొకశుభవార్తనందిచ్చును.

నీల : నేటు తనయాస్తినంతయుఁ, దనతదనంతరము నీకును, జంద్రరేఖకును జెందునటులు వ్రాసినదానపత్రము గైకొనుము. నాకేమియు రుసుమక్కఱలేదు.

సుంద : నారీమణులారా ! ఆకలిదప్పులచేఁగృశించుచున్నవారికి మీరమృతపానమిచ్చుచున్నారు.

ఇంది : అరుణోదయమైనది. తూరుపుతెలివొందుచున్నది. మన కథా వృత్తాంతము మీకు సంపూర్ణముగ నింకను గోచరించుటలేదు. లోనికరుగుదము రండుప్రశ్నోత్తర పూర్వకముగానన్నివిషయములు మేము మీకుఁదెలుపఁగలము.

కేశవ : కానిమ్ము. నీలవేణియుంగరమును భద్రపఱచుటతప్పమతెందులకు, గాని నాకీజన్మమున భయములేదు. (నిష్క్రమింతురు).

మంగళం



# అనుబంధము

## విజయనగరము — రాయల ఆస్థానమంటపము.

[పురప్రముఖులు, మంత్రులు, సత్యమూర్తి, వసంతయ్య, కేశవరావు, తదితరులు సభనలంకరించియుందురు.]

వందిమాగధులు రాయలవారిరాక నెఱింగించుచు, స్తుతిపాఠము చేయుదురు. (జయా, విజయీభవ ఇత్యాదులు).

[శ్రీ రాయలు సపరివారముగఁ బ్రవేశింతురు.]

రాయ : (సింహాసనాసీనులై) సభాసదులారా ! యీనాటి యీసభ నాకెంతో సంతోషకరము. ఇఁకముందీవిజయనగరసంస్థానప్రజలు ధనపిశాచ దాస్యమునుండి, ఋణబంధములనుండి విమోచనమునొందుటకై ప్రేమసూత్రమును సహకారసిద్ధాంతమునఁ బోషింప నిశ్చయించి నాఁడను. అందులకై వలయు రాజశాసనమును మంత్రివర్యులు నేఁడే సిద్ధపఱచియున్నారు. ప్రప్రథమమున, యీపురజనుల యుపయోగార్థమొకసహకారసంఘమును స్థాపించఁదలఁచితిమి. మీరెల్లరందు సభ్యులగుట కిచ్ఛగింతురని నమ్మెదను.

సభ్యు : చిత్తము, మహాప్రభూ !

రాయ : పరోపకారదీక్షాపరతంత్రుఁడును, స్వార్థత్యాగియునైన సత్యమూర్తి గారాసంఘమునకుఁ దొలియధ్యక్షపదవి స్వీకరింపవేడెదను. వారి విచిత్రస్వానుభవము సహకారపరపతికి బీజాక్షరమైయున్నది. కాన వారీ గౌరవస్థానమునకెంతయునర్హులు. ఇది మీ యందఱికిని సమ్మతమేగదా !

అంద : (ఏకగ్రీవముగ) సంతోషము, సంతోషము !

సత్య : మహాప్రభూ! నేఁడిచ్చటఁదమచేనెలకొల్పబడిన యీప్రేమాంకురిత సహకారమహావృక్షము శాఖోపశాఖాంతరమై, యీభూతలమంతయు నావరించి మహావటవృక్షనీడను బక్షిజాలమువలె దారిద్ర్యకష్టభాజనులగు బీదజనులెల్లఱ రక్షించి ప్రోదిచేయునుగాక!
రాజమన్ననచే నే నెంతయుఁ గృతకృత్యుఁడను.

రాయ : సహకారపతాకము వర్ధిల్లుఁగాఁత! (పతాకావిష్కరణము జరుపును).

(సభ్యులందరు సహకారపతాకోత్సవము జరుపుదురు.)

—: గేయము :—

1. ఐక్యమొంది ఐంద్రచాపధ్వజమునెత్తుఁడీ
ధ్వజము విసరి దానినిల్పు మున్నతోన్నతిన్ ॥

2: లోకమంతయున్ లక్ష్యపెట్టకే
లోకులెల్లనణచు సకల దుష్టగణములన్ ॥

3. ధనమదాంధులన్ కుజకుబేరులన్
కొలుచువారినెల్లఁ గూల్చు లక్ష్యపెట్టకే ॥

4. కూర్చుప్రజలకున్ శాంతిధర్మముల్
బద్ధశృంఖలార్తిఁ బాపి స్వేచ్ఛఁజాటుచున్ ॥

5. దేశదేశముల్ హద్దుమీరినన్
మనపతాక మెల్లవేళ నెగురుచుండుగా!

6. ఒకరికొకరుగా వృద్ధికోరకే
సకలజనులు నేకముఖిగ శ్రేయమొందఁగా ॥

7. కలసి మెలఁగుఁడీ! కూడఁబలుకుఁడీ
తక్షణంబ నేఁడు ధ్వజము ననుగమింపుఁడీ ॥

8. అంబరమ్మునన్ నవ్యేంద్రధనువుచే
మనపథమ్ము నూత్నకాంతి కలితశోభయా ॥

[నిష్క్రమింతురు.]

తిరుమల తిరుపతి దేవస్థానం ప్రెస్, తిరుపతి. కా. 1000. 25—3—1957.

తే 30—6—56 దిన ఆంధ్ర సెంట్రల్ కో-ఆపరేటివ్ ఇన్‌స్టిట్యూటువారు తిరుపతిలో ప్రదర్శించిన ''ఇందిరా వసంతము'' నాటక పాత్రధారులు.



కుర్చీలలో : నీలవేణి ( ఎన్. సి. హెచ్. వేంకటేశ్వరరావు ); ఇందిర (మహమ్మద్ మస్తాన్‌వలీ): రాయలు (కె.బి. మాధవరావు); గ్రంథకర్త: జి. వేంకటేశయ్య సేటు (ఎస్. గోపాలకృష్ణమూర్తి); చంద్రరేఖ (బి. రాజేశ్వరమూర్తి).

నిలుచుకొని: భరతుడు (సి. కోటీశ్వరరావు); కేశవరావు (ఎన్. కృష్ణమూర్తి); సత్యమూర్తి ( ఎమ్. రామమూర్తిరాజు ); శివరావు ( టి. శివలింగం ); వసంతుడు ( ఎల్. కొండారెడ్డి ); సుందరేశం ( వీరభద్రాచారి ); మత్స్యరాజు (సత్యనారాయణమూర్తి).

నేలమీద : రాముడు ( డి. ఆంజనేయులు ); బసవయ్య ( ఎమ్. వెంకటేశ్వరరావు ) కేరళప్రభువు ( జె. సుబ్రహ్మణ్యం ); సుబ్బన్నడు ( సి. సూర్యప్రకాశరావు గోపాలుడు ( సత్యనారాయణమూర్తి ).

# గ్రంథసమీక్ష



శ్రీగుఱ్ఱం వేంకటేశయ్యగారు రచించిన "ఇందిరా వసంతము నందందు చూచితిని. ఇది Merchant of Venice" నకు అనుకరణ.

పద్యరచన సుఖముగానున్నది.

వచనరచన పాఠయోగ్యతను సంపాదించినది. పాశ్చాత్య దేశపరిస్థితులు మార్చి భారతదేశపరిస్థితులు నాటకమున సంధానపరుపబడినవి. భాషకూడ పాత్రానుగుణముగ గ్రాంథిక వ్యావహారికములు వాడబడినవి.

అచ్చటి రంగము లిచ్చటికి ననువదింపఁబడినవి. మూలములోని కొన్ని ప్రసిద్ధఘట్టములు చక్కని పద్యరచనలోఁ బొదుగఁబడినవి, తత్తన్మధురభావానుకూలముగఁ గొన్ని పాటలు వ్రాయబడినవి.

మొత్తముమీఁదఁ గావ్యము పాఠయోగ్యముగనున్నది. ప్రదర్శనయోగ్యత నాటకమునందే కలదు. చాలమంది పూర్వము షేక్స్పియరు నాటకములను తెలుగు పరచిరి. ఇది వాని యన్నిటికంటె మిన్న యనిపించుచున్నది.

విజయవాడ
31-3-57

విశ్వనాథ సత్యనారాయణ.